# ఇందులోని గ్రంథముల అనుక్రమణిక

పేజి సం.

# లఘు గ్రంథములు

## నాల్గవ భాగము

ఇందులో :

1. దర్శనములు
2. ఆర్యసమాజమననేమి ?
3. ఈశ్వరుడు ప్రత్యక్ష సిద్ధమా ?
4. వైదిక త్రైతవాదము
5. మనము హిందువులమా ?

"కళాప్రపూర్ణ" డా. పం. గోపదేవ్

ప్రకాశకులు:
ఆర్య సమాజము, కూచిపూడి-522 313

అంబా దర్శన గ్రంథమాల - 2000 ప్రతులు



జూన్ 1993

**వెల : 10-00**

ప్రతులకు:

1. ఆర్యసమాజము, కూచిపూడి-522 313. (తెనాలి తాలుకా)
2. మాశెట్టి వేంకటేశ్వర రావు, 3-3-738,
   కంచరి బజారు, సికింద్రాబాదు-3.

ముద్రణ:

శ్రీశ్మా ఇంప్రెషన్స్, సికింద్రాబాద్-3.

# అంబా దర్శన గ్రంథమాల

మహారాజపోషకులు:- రూ.15,000లు అంతకుపైన నిచ్చువారు
రాజపోషకులు:- రూ.10,000లు అంతకుపైన నిచ్చువారు
పోషకులు:- రూ.5,000లు అంతకుపైన నిచ్చువారు

మహారాజపోషకులు:

1. శ్రీమతి కొత్తపల్లి యామినీదేవి — కూచిపూడి
2. శ్రీ బెల్దె జగదీశ్వరయ్యశ్రేష్ఠి — సికిందరాబాద్
3. శ్రీ మాశెట్టి వేంకటేశ్వర రావు — సికిందరాబాద్
4. శ్రీ కొసరాజు మాధవయ్య — తెనాలి
5. డా.శ్రీ వై.వి. సుబ్బారావు, సరోజనీదేవి — గుంటూరు
6. శ్రీ గ్రంధి కామరాజు — విజయవాడ
7. శ్రీ కావూరి జయచంద్రవర్మ — కూచిపూడి
8. శ్రీ చదలవాడ అచ్చేశ్వరరావు, రాజ్యలక్ష్మి — కూచిపూడి
9. శ్రీమతి చదలవాడ లక్ష్మమ్మ — కూచిపూడి
10. శ్రీ మత్తిరెడ్డి గురవారెడ్డి — తూములూరు
11. శ్రీ చంద్రయ్య & సన్సు-అలవాల — సికిందరాబాద్
12. శ్రీ యం.యస్. బాలకృష్ణ, సుధాకర్ — సికిందరాబాద్
13. శ్రీ ఉప్పల రాజేశ్వర రావు — సికిందరాబాద్
14. శ్రీ కొసరాజు తిరుమలరావు, సూర్యకుమారి — కురుమద్దాలి
15. శ్రీ గత్తె సుబ్బారావుగుప్త, నాంచారమ్మ — గుంటూరు
16. శ్రీ జక్కిడి సీతారామరెడ్డి — సికిందరాబాద్
17. శ్రీ తుమ్మల వల్లభయ్య — కూచిపూడి
18. శ్రీ నోముల స్వామిదాస్, శ్రీ శ్రీపతి వెంకటరావు — సికిందరాబాద్
19. శ్రీ వాసంశెట్టి రామకృష్ణారావు — వలసపాకల
20. శ్రీ బొల్లేపల్లి సత్యనారాయణ — గుంటూరు

రాజపోషకులు:

1. శ్రీ కావూరి సంగయ్య — కూచిపూడి
2. శ్రీ జె. వెంకటరావు — వరంగల్
3. శ్రీ బి. శంకరలాల్ — హైదరాబాద్
4. శ్రీ యలవర్తి రామకోటయ్య, సీతారత్నం — కూచిపూడి
5. శ్రీ కుమ్మరి పోచయ్య — సికిందరాబాద్
6. శ్రీమతి బొర్రా వేంకటరత్నమ్మ — కూచిపూడి
7. శ్రీ యం. భూపతిరావు, ప్రజ్ఞాపురం — హైదరాబాద్
8. శ్రీ సరిదె శ్రీనివాసరావు, కనకలక్ష్మి — రేలంగి, గోదావరి(జి)
9. శ్రీ వి.యస్.గుప్త — కొత్తగూడెం
10. కీ.శే. మలిపెద్ది సిద్దయ్య ధర్మపత్ని చంద్రమ్మ — మర్కాముల
11. శ్రీమతి చదలవాడ రాజ్యలక్ష్మి — కూచిపూడి
12. శ్రీ తలశిల శ్రీరాములు — నాగాయలంక

పోషకులు:

1. శ్రీ మేకా రామకృష్ణయ్య — కూచిపూడి
2. శ్రీ జాస్తి వెంకటప్పయ్య, తులశమ్మ — కూచిపూడి
3. శ్రీమతి దాసరి రామకోటమ్మ — కూచిపూడి
4. శ్రీమతి కన్నెగంటి శైలసుత నవరత్నకుమారి — కూచిపూడి
5. శ్రీ కోట్ల రమణారెడ్డి — సికిందరాబాద్
6. శ్రీ పోలం వీరయ్య సోదరులు — సికిందరాబాద్
7. శ్రీ కోడూరి సుబ్బారావు — సికిందరాబాద్
8. శ్రీ దుర్గా సత్యనారాయణ, కృష్ణవేణి — తణుకు
9. శ్రీ కావూరి శివరామయ్య — మోపిదేవి
10. శ్రీ గడ్డిపాటి వేంకట కృష్ణయ్య — అమృతలూరు
11. శ్రీ చుండూరి శ్రీహరిరావు, శాంతకుమారి — గుంటూరు
12. శ్రీ మల్లాది సూర్యనారాయణ మూర్తి — రాజంపేట (తూ.గో.)

1. సత్యార్థప్రకాశము, 2. వేదతత్త్వ ప్రకాశము (ఋగ్వేదాది భాష్యభూమిక), 3. దయానంద ఋగ్వేద భాష్యభాస్కరము 1, 2, 3 భాగములు, 4. శ్రీమద్భగవద్గీత, 5. శ్రీ స్వామి దయానంద సరస్వతి జీవిత చరిత్ర, 6. అర్థ ధర్మ మీమాంస, 7. డా.పం.గోపదేవ్ ఆత్మచరిత్ర, 8. గురువు విరజానంద జీవితచరిత్ర

9. ఈశావాస్యోపనిషత్తు, 10. కేనోపనిషత్తు, 11. కఠోపనిషత్తు, 12. ప్రశ్నోపనిషత్తు, 13. ముండకోపనిషత్తు, 14. మాండూక్యోపనిషత్తు, 15. తైత్తిరీయోపనిషత్తు, 16. ఐతరేయోపనిషత్తు, 17. శ్వేతాశ్వతరోపనిషత్తు, 18. ఛాందోగ్యోపనిషత్తు, 19. బృహదారణ్యకోపనిషత్తు

20. న్యాయదర్శనము, 21. వైశేషికదర్శనము, 22. సాంఖ్యదర్శనము, 23. యోగదర్శనము, 24. వేదాంతదర్శనము (వ్యాసకృత బ్రహ్మ సూత్రములు)

25. ఆస్తికవాదము, 26. ఆర్యాభివినయము, 27. ఆర్యగృహిణి, 28. సంస్కారవిధి, 29. ఈశావాస్యోపన్యాసములు, 30. పూజ, 31. వైదికదినచర్య, 32. వైదికవివతి (స్వాధ్యాయమంజరి) 1, 2 భాగములు, 33. ఏసుక్రీస్తు రహస్య జీవనము, 34. వ్యవహారభానువు, 35. బ్రాహ్మణగోవు (గవిసూక్తము), 36. మాతృభూమి స్వరాజ్యము (పృథ్వీసూక్తము), 37. ఆర్యావర్తవాణి, 38. వైదిక పర్వ పద్ధతి, 39. ఆర్యసమాజ నియమములు - ఉపనియమములు

## లఘు గ్రంథములు

### మొదటి భాగము

1. వేదాంతి ధ్వాంత నివారణము, 2. గోకరుణానిధి, 3. భాగవత ఖండనము, 4. లక్ష్మీసూక్తము

### రెండవ భాగము

1. అపశూద్రాధి కరణము, 2. శంకరపీఠాధిపతులు-అంటరానివారు, 3. హేతువాది దయానంద, 4. జాతీయత, 5. శ్రీరామ నవిమి - సీతాకళ్యాణం

### మూడవ భాగము

1. వేదమే ఈశ్వరీయము (బైబిలు - ఖురానులు కావు), 2. ఈశ్వర స్వరూపము, 3. అహం-నేను, 4. వైదిక వర్ణవ్యవస్థ, 5. ఓమ్ స్మర, 6. అవతార మీమాంస

### నాల్గవ భాగము

1. దర్శనములు, 2. ఆర్యసమాజమననేమి ?, 3. ఈశ్వరుడు ప్రత్యక్ష సిద్ధమా ?, 4. వైదిక త్రైతవాదము, 5. మనము హిందువులమా ?

# సంపాదకీయము

"కళాప్రపూర్ణ" పండిత గోపదేవ్‌గారు సుమారు 25 లఘుగ్రంథములు రచించిరి. వానినింతకు ముందు విడివిడిగా ముద్రించితిమి. ఇప్పుడు - కాగితము ధర విపరీతముగా పెరుగుట చేతను, ప్రింటింగ్ రేట్లు హెచ్చుట చేతను, అట్టబైండింగ్ మొదలగునవి కలిసివచ్చునను మూహతోను లఘుగ్రంథములనన్ని టిని 4 భాగములుగా ముద్రింపదలచి మొదటి భాగము ముద్రించితిమి. 2, 3 భాగములు త్వరలో ముద్రింతుము. ఇది నాల్గవ భాగము. ఇందు 1. దర్శనములు 2. ఆర్యసమాజమననేమి? 3. ఈశ్వరుడు ప్రత్యక్ష సిద్ధమా? 4. వైదిక త్రైతవాదము 5. మనము హిందువులమా? కణాదుడు - భౌతికవాదము మొదలగు విషయములు గలవు.

1. 'దర్శనములు' అను గ్రంథములో దర్శనపదమేర్పడురీతిని, దర్శన శబ్దార్థమును దెల్పిదానివలన మానవునకేమి ప్రయోజనమో వివరింపబడెను. పాశ్చాత్యదర్శనములు, ప్రాచ్యదర్శనములు, ఆస్తికములు, నాస్తికములునని దర్శనములు పలువిధములుగానున్నవి. చార్వాక, బౌద్ధ, జైన దర్శనములు నాస్తికములనియు, న్యాయ, వైశేషిక, సాంఖ్య, యోగ, పూర్వమీమాంస, ఉత్తరమీమాంసలు ఆస్తికములనియు వ్యవహరింపబడును. (1) న్యాయదర్శనములో ప్రత్యక్షాది నాలుగు ప్రమాణముల గూర్చియు, ప్రమాణము, ప్రమేయము, సంశయము మొదలైన పదునాఱు పదార్థముల గూర్చియు చర్చించెను జీవేశ్వరులు ప్రత్యేక పదార్థములని యంగీకరించును. (2) వైశేషిక దర్శనములో తత్త్వజ్ఞానమువలన ముక్తిలభించుననియు, తత్త్వజ్ఞానము లోకములోని పదార్థములయు, వాని గుణములయు యథార్థ జ్ఞానమువలననే కలుగుననియు 24 గుణములు ద్రవ్యముల నాశ్రయించియుండుననియు, పరమాణువులలో గలభేదమును తెలుపు పదార్థములు విశేషములనబడునని చెప్పెను. (3) సాంఖ్య దర్శనములో ప్రకృతి పురుషుల గూర్చియు, ప్రకృతి సృష్టి రూపమున పరిణామము చెందుననియు, 25 తత్త్వములు కలవనియు సంఖ్యలో చెప్పెను. (4) యోగదర్శనమునకు సాంఖ్యముతో సామ్యముండును. యోగదర్శనములో యోగమునభ్యసించి యీశ్వర సాక్షాత్కారము పొందుటకు మార్గములు చూపబడెను. (5) పూర్వమీమాంసలో నధికముగా వైదిక కర్మకాండనే చర్చించినది. యజ్ఞములు వాని ప్రక్రియలు, విధులు వివరింపబడెను. (6) ఉత్తర మీమాంసలో సృష్టిస్థితి లయములకు కారణమైన

బ్రహ్మమును గూర్చి చర్చించును. కావుననే దీనికి బ్రహ్మసూత్రములనియు పేరు.

2. 'ఆర్యసమాజమనేమి?' అను గ్రంథములో ఆర్యులనవెవరు? ఆర్య సమాజస్థాపనము, దానినియమములు, దానిప్రయోజనములు, దెల్పి దానియెడ ప్రజలకున్న యపోహను పొగొట్టు ప్రయత్నము చేయబడెను.

3. 'ఈశ్వరుడు ప్రత్యక్ష సిద్ధమా?' అనుదానిలో ప్రత్యక్షాది ప్రమాణముల గూర్చియు, ఈశ్వర లక్షణముల గూర్చియు దెల్పి యీశ్వరుడు ప్రత్యక్ష సిద్ధమే యని నిర్ధారింపబడెను.

4. 'వైదికత్రైతవాదము' దీనిలో నిత్యతత్త్వములు మూడనియు - అవి ఈశ్వరుడు, జీవులు, ప్రకృతి యనియు వివరించి అద్వైతాది మతములు అవైదికములనియు నంగీకరింపరానివనియు వైదిక ప్రమాణములతో నిరూపించెను.

5. 'మనము హిందువులమా?' అను గ్రంథమున హిందుశబ్దము భారతీయ భాషలలో లేదనియు, పర్షియన్ భాషా పదమనియు, దాని యర్థము లన్నియు చెడు నర్థములే కాని యొక్క యర్థము కూడ మంచిది లేదనియు, భారతీయేతరులచే కాఫిర్ (పాపి) అనునర్థములో నంటగట్టబడినదనియు, దెల్పి మనము హిందువులము కామనియు, దేశరీత్యా భారతీయులమనియు, ధర్మము రీత్యా హిందువులను కొనువారు వైదికులనియు వివరించి విశ్వహిందూ పరిషత్తువారికి తమనామము 'విశ్వవైదిక పరిషత్తు' అనుట యుచితమేమో యాలోచించుడని సలహోయిచ్చెను.

పాఠకులారా ! చిన్న చిన్న గ్రంథములను 4 సంపుటములుగా విభజించి ప్రింట్ చేయుటచే నొకేసారి హెచ్చు ధరకు కొనవలసి వచ్చినదను కొంత యసౌకర్యమున్నను విడివిడిగా పుస్తకములు దూరమగు ప్రమాదము నుండి రక్షణ కలుగుటయు, నొకే సంపుటములో పలువిషయములు సంగ్రహించుకొను నవకాశముండును కావున నిది కొంత ప్రయోజనకరముగా నుండునేమో యాలోచింతురుగాక! ఒకేసారి ఖర్చు పెట్టవలసివచ్చుటను పై సౌకర్యముల దృష్టిలో బెట్టుకొని సహించుటయే మంచిదని మాయభిప్రాయము. ఈ దృష్టిలో పూర్వమువలెనే పాఠకమహాశయులు మా అంబాదర్శన గ్రంథ మాలకు సహకరించుచు నింకను క్రొత్త గ్రంథ ప్రచురణకు తోడ్పడుదురుగాక!

- వెంకయ్యార్య

# దర్శనములు

'దృశిర్ ప్రేక్షణే' అను ధాతువునకు 'ల్యుట్' ప్రత్యయము చేర్చిన 'దర్శనము' అనుపద మేర్పడుచున్నది. దేనిచే చూడబడునో - తెలియబడునో యది దర్శనమని చెప్పనగును. జ్ఞానము కలిగించునది దర్శనమని భావము.

మానవుడు తెలిసికొను స్వభావము గలవాడు. 'మను' ధాతువునకు అవబోధన మని యర్థము. కావున మానవుడన తెలిసికొన గలవాడని స్ఫుటమగుచున్నది. ప్రపంచదేశములందు గల బుద్ధిమంతులైన మానవులు తాము తమ చుట్టునున్న వస్తువులను విశేషముగా తెలిసికొన యత్నించుచు వచ్చిరి. వారు తెలిసికొనిన క్రమమును తెలుపునవియే దర్శనములు. మనుష్యుడు బాల్యదశయందు కూడ తన చేతికందిన వస్తువును క్రింద మీద చూచి యది యేమో తెలిసికొన యత్నించుట చూతుము. కొందఱు బాలురు తమ చేజిక్కిన పదార్థమును ముక్కలుచేసి, దాని యవయవములను దానినుండి వేఱు చేసి యది యేమో తెలిసికొన యత్నింతురు. పెద్దల కాబాలురు తమ కందిన వస్తువులను పాడుచేయుచున్నట్లు కనిపించును. కాని యది సత్యము కాదు. బాలుర కావస్తువేమో తెలిసికొన కోరిక గలిగి, దాని యవయవములు విడదీసిన యది యేమో తెలియునని యటుల చేయుదురు. బాలుర యీ ప్రవృత్తి వారిలోగల జిజ్ఞాసాభావమును తెలుపుననుట ఆలోచన కలవారికి తెలియని విషయము కాదు. అట్లే పెద్దలయందును తానననేమి ? తనకు చుట్టునున్న పదార్థము లేమిటి ? రాత్రి యందు ఆకసమున మినుకు మినుకు మనుచు నానావిధకాంతుల నీను పదార్థము లేమిటి? అను జిజ్ఞాసలు కలుగు చుండుట యప్రసిద్ధము కాదు. ఇట్టి జిజ్ఞాసాఫలితమే నేడు దర్శనపదముతో వ్యవహరింపబడు సాహిత్యము.

వస్తువులను తెలిసికొనుటకు ప్రయత్నించుట మానవ స్వభావము. అయినను అందఱకు వస్తుయాథార్థ్యమును తెలిసికొనుట సులభము కాదు.

బాహ్యపదార్థములు స్థూలముగా నున్నంతవఱకు నవి మనుజుని యింద్రియ ములు (త్వక్కు, చక్షువు, శ్రోత్రము, జిహ్వ, ఘ్రాణము) చే గ్రహింప బడును. వాని స్థూలరూపము ఇంద్రియ గోచరమగునని భావము కాని మనకు స్థూలముగా గనబడు నావస్తువుల వాస్తవికరూప మదియేనా ? అరూప మెల్లప్పుడు నట్లే యుండునా ? మనకు దెలియబడునది వస్తువా ? వస్తుధర్మములా ? ఒకానొక వస్తువు ఒకనాడుండునట్లు మఱియొక నా డుండదేల ? అను నిట్టి ప్రశ్నలెన్నియో మానవ మస్తి ష్కమున నేర్పడును. వీని కన్నింటికి సమాధానములే దర్శనములు.

వస్తువును విశేషించి తెలిసికొన గోరువ్యక్తి యావస్తువు మూలరూప మేమో తెలిసికొన గోరును. తనకు స్థూలముగా గోచరించుపదార్థమును పరికించినకొలది యది యనేక తత్త్వములతో గూడి యున్నట్లుతోచును. ఏ తత్త్వములతో నది యేర్పడినదని నిర్ణయింపనగును. ఇట్లు స్థూలవస్తు వును విభజించి దాని మూలపదార్థములను దెలిసికొనుట దార్శనికుని ముఖ్యకార్యము. స్థూలముగా నింద్రియములచే నెఱుంగబడు నీప్రపంచ మునకు గల మూలతత్త్వములను తెలిసికొను పద్ధతికే దర్శనమని చెప్పిన బాగుండునని తోచుచున్నది. దర్శనములిట్లే లోకమున నెన్నియో యేర్పడినవి. స్థూలజగత్తును జూచి దీనికి మూలకారణము లెయ్యవియో తెలిసికొన యత్నించిన మహనీయులలో గొందఱు ప్రపంచమునకు మూల కారణ మొక్కటియే యనియు, మఱికొందఱు కాదు రెండనియు, అది యును గాదు మూడని కొందఱు నిర్ణయించి యున్నారు. దర్శనముల నధ్యయనము చేసినందున తెలియు విషయమింతకు మించి యుండదు.

దర్శనము ఒకటి కాదు, అనేకములు. పాశ్చాత్య దర్శనములు, ప్రాచ్య దర్శనములు, ఆస్తికదర్శనములు, బౌద్ధదర్శనములు, జైనదర్శనములు అని యెన్నియో దర్శనములు ఉపలబ్ధము లగుచున్నవి. వైదికులలో వేద ములకు ఉపాంగములని చెప్పబడు షడ్దర్శనములు అతి ప్రసిద్ధములు. పుష్పదంతుని 'శివమహిమ్న స్తోత్రము'న సాంఖ్య, యోగ, పాశుపత, వైష్ణవ దర్శనముల ప్రసక్తి చూడనగును. కౌటిల్యుని అర్థశాస్త్రమునందు సాంఖ్య, యోగ, లోకాయత దర్శన నామములు కనబడును. గురు గీతయందు గౌతమ, కణాద, కపిల, పతంజలి, వ్యాస, జైమినులచే

వ్రాయబడిన షడ్దర్శనముల నామములు చూడనగును. సర్వసిద్ధాంత సంగ్రహమునందు శంకరాచార్యులు లోకాయత, ఆర్హత, బౌద్ధ, న్యాయ, వైశేషిక, భాట్ట ప్రాభాకర మీమాంస, సాంఖ్య, యోగ, వేదాంతము లను గూర్చి ప్రసంగించుట చూడనగును. పైన జూపిన దర్శనములన్నియు భారతీయ దర్శనములనియే చెప్పనగును. ఇందు న్యాయ, వైశేషిక ములు, సాంఖ్యయోగములు, పూర్వోత్తర మీమాంసలు (మీమాంస, వేదాంతదర్శనములు) అను ఆఱును షడ్దర్శనము లనియు, షట్ శాస్త్రములనియు చెప్పబడుచున్నవి. భారతీయ దర్శనములలో నియ్యవి ఆస్తికదర్శనములనియు వ్యవహరింపబడుచున్నవి.

మానవులలో వస్తువులను విశ్లేషించి వాని మూలకారణములను తెలిసికొనవలయు నను కోరిక కలుగుటకు కారణమేమైయుండును ? మానవుని ప్రవృత్తులు - అతడొనర్చు కర్మలు నిష్ప్రయోజనము లెన్నడు కావు. ప్రయోజనము లేని క్రియలందు మానవులకు ప్రవృత్తి కలు గదు. కావున పదార్థ విశ్లేషణ ప్రవృత్తియు సప్రయోజన మనక తప్పదు. ఆప్రయోజనమేమి ? లోకమున మానవుడు జీవితమున నెన్నియో సుఖ దుఃఖముల ననుభవించును. సుఖము నభిలషించును. దుఃఖము నభిలషింపడు. ప్రతివ్యక్తియు సుఖము నభిలషించి దాని ప్రాప్తికొఱకు ప్రవృత్తి కలవాడగును, దుఃఖము నభిలషింపక దానినుండి నివృత్తుడగును. ఇట్లు జీవితకాలమంతయు తనకు ప్రియకరమగు సుఖప్రాప్తికై యత్నిం చును. దుఃఖము నుండి పూర్తిగ విడివడనంతవఱకు మానవుడు తన యత్నము నుండి విరమింపడు. కావున మానవ జీవితమునకు దుఃఖ విముక్తి, సుఖప్రాప్తి లక్ష్యమని యెంచవలసి వచ్చుచున్నది. ఇట్టి లక్ష్య మును సాధించుటకే దార్శనికుడు తన బుద్ధిబలము నుపయోగించి ప్రపంచమూలతత్త్వముల నన్వేషింపదొడగును. ఈ తత్త్వాన్వేషణమే దర్శనశాస్త్ర లక్ష్యము. తత్త్వజ్ఞానమే దుఃఖనివృత్తికి సుఖప్రాప్తికి ముఖ్య సాధనము. కావుననే ఆస్తికదర్శనముల కన్నింటికి నొక లక్ష్య మున్నట్లు చూడనగును. అదియును పరమతత్త్వమగు పరమేశ్వర సాక్షాత్కారమే. అందువలననే ఉపపనిషత్తులలో -

'తమాత్మస్థం యేఽనుపశ్యంతి ధీరాః తేషాం సుఖం శాశ్వతమ్. నేత-

మానవు డనుభవించు దుఃఖము లన్నింటిలో మృత్యు దుఃఖ మత్యంత దారుణమైనది. దానికి భయపడినంతగా మానవుడితర దుఃఖమునకు దేనికిని భయపడడు. మానవునకు కావలసినది మృత్యుపర్యంత దుఃఖముల నుండి విముక్తియే కాదు. అతనికి శాశ్వత సుఖము - ఆనందము కూడ కావలసియున్నది. జీవుడు దుఃఖములనుండి విడివడి యనుభవ రహితుడై యుండజాలడు. శాశ్వతసుఖ - ఆనందప్రాప్తి యతనికి ముఖ్యము. అతని కట్టిస్థితి లభించుటకై పరమేశ్వరుని సాక్షాత్కారమునకు మించి మఱియొండు ఉపాయము - మార్గము లేదు. దానినే మంత్రవర్ణము లిట్లు వర్ణించుచున్నవి. "తమేవ విదిత్వాఽతిమృత్యు మేతి నాన్యః పంథా విద్యతేఽయనాయ" భారతీయ దర్శనము లిట్టి సాధ్యమును సాధించుటకే తత్త్వాన్వేషణము నారంభించినవి. కావుననే గోతముడు "......... తత్త్వజ్ఞానాత్ నిశ్శ్రేయసాధిగమః" అని తన దర్శనమున సూత్రించియున్నాడు.

దార్శనికు లెల్లరు తత్త్వజ్ఞానము కొఱకు ప్రయత్నించినట్లు దర్శనశాస్త్రములను చదివిన మీదట బోధపడును. కావుననే జ్ఞానము కలుగుటకు గల సాధనసంపత్తిని గూర్చి ప్రతి దర్శనమునందును చర్చించుటయు జాతుము. జ్ఞానసాధనము లేక జ్ఞానము కలుగనేరదు. కావున జ్ఞానము కలుగుటకు గల సాధనములేవి ? జ్ఞానమునకు ప్రమ యనియు నామాంతరము. ప్రమను గలిగించునది ప్రమాణము. ఇట్లు ప్రమాణమన జ్ఞానసాధనమని యర్థము. ప్రమాణము మూలమున దెలియబడునది ప్రమేయ మనబడును. ప్రపంచతత్త్వము లన్నియు ప్రమేయములుగాను, వానిని దెలుపు - వాని జ్ఞానమును గలిగించు సాధనములు ప్రమాణములుగాను వ్యవహరింప నగును. అందువలననే దర్శనములందు ప్రమాణ ప్రమేయ భేదముతో రెండు విధముల తత్త్వజ్ఞానముకొఱకు యత్నించి యున్నట్లు స్పష్టమగును. దర్శనములలో ప్రమాణములకు సంబంధించిన చర్య విశేషించి చూడనగును. దర్శన కర్తలలో ఒకరు ఒకే ప్రమాణమును, కొందఱు రెండు ప్రమాణములను, మఱికొందఱు మూడు ప్రమాణములను, ఇంక కొందఱు నాలుగు ప్రమాణములను ఇట్లు ఎనిమిది ప్రమాణముల వఱకు జ్ఞానసాధనములుగ నంగీకరించినవారున్నారు.

వస్తువు - తత్త్వము యొక్క సత్యాసత్యములను నిర్ణయించుటకు ప్రమాణము తక్క మఱియొందు సాధనమే లేదు. దీనింబట్టి దర్శనములందు ప్రమాణములకు గల మహత్త్వమును చదువరు లూహింపగలరు. ప్రమాణములకు భారతీయ దర్శనకర్తలు ప్రత్యక్షము, అనుమానము, ఉపమానము, శబ్దము, ఐతిహ్యము. అర్థాపత్తి, సంభవము, అభావమునని నామకరణము చేసి యున్నారు. ఇవియే ప్రమాణములు. విశ్వమునగల ప్రతితత్త్వము ఈ ప్రమాణములలో నేదేని యొక ప్రమాణముచే దెలియదగినదై యుండవలయును. అట్లు తెలియబడని నాడాతత్త్వమునకు ఉనికి - సత్తయే లేదని యర్థము. ఉనికిలేని తత్త్వము ప్రమేయము కానేరదు. ఇట్లు ప్రమాణగమ్యమైన తత్త్వము తదుపరి లక్షణాదులచే వివరింపబడును. ప్రమాణము మూలమున వస్తువు తెలియబడి దానిని గ్రహించుటకగు ప్రవృత్తి సఫలమైననా డావస్తుతత్త్వము సిద్ధించును. అది సత్యముగా గ్రహింపబడును. కావుననే దార్శనికులు "లక్షణ ప్రమాణాభ్యాం వస్తుసిద్ధిః, న తు ప్రతిజ్ఞామాత్రేణ" 'లక్షణ ప్రమాణముల మూలమున వస్తువు సిద్ధించును కాని యొక రొక వస్తువున్నదని ప్రతిజ్ఞ చేసినంత మాత్రమున దాని యునికి సిద్ధింపదు' అని చెప్పుదురు.

భారతీయ దర్శనములను ఆస్తిక, నాస్తిక భేదములతో రెండు విధముల విభజింపవచ్చును.

చార్వాక, బౌద్ధ, జైన దర్శనములు నాస్తిక దర్శనములనియు, న్యాయ, వైశేషిక, సాంఖ్య, యోగ, పూర్వోత్తర మీమాంసలు ఆస్తిక దర్శనములనియు వ్యవహరింపబడును.

## 1. చార్వాక దర్శనము :-

జడవాదులను చార్వాకులందురు. వీరు ప్రపంచ పదార్థములన్నియు జడములే యనియు, చేతనమను పదార్థమొందు లేదనియు చెప్పుదురు. ప్రత్యక్ష ప్రమాణమును మాత్రమే వీరు అంగీకరింతురు. అనుమానాది ప్రమాణములు నిశ్చిత వస్తుతత్త్వమును తెలుపజాలవని వీరు చెప్పుదురు.

ప్రత్యక్షమువలన భౌతికజగత్తు తెలియును. పృథివి, జలము, అగ్ని, వాయువు అను నాలుగు భూతములనే వీరంగీకరింతురు. ఆకాశము నంగీకరింపరు. ప్రాపంచిక పదార్థము లన్నియు నీనాలుగు భూతముల

సమ్మేళనమువలన నేర్పడుచున్నవి. 'నేను లావుగా, సన్నగా, అందముగా ఉన్నాను. నాకు జ్వరము వచ్చినది, నేను కుంటి, గ్రుడ్డివాడను, నడువలేను' అను నిట్టి ప్రయోగములన్నియు శరీరమునే కదా బోధించును. అంతకు మించి చేతన మనునది యెక్కడనున్నది. అదియే లేనపుడు ఈశ్వరునకు ప్రపంచమున నునికి యెక్కడనుండి వచ్చును ? భూతసమ్మేళనము వలననే శరీరము, అందు జ్ఞానాది గుణములు నుద్భవించును. జ్ఞానేచ్ఛాది గుణముల కాధారముగ నొక చేతనపదార్థ మంగీకరించుట వ్యర్థము. ఆ ధర్మములన్నియు శరీరమునకు జెందినవే యని చార్వాకమతము. శరీరముతోబాటు చైతన్య ధర్మములు కూడ నశించును. మరణానంతరము మిగులున దేమియు నుండదందురు.

ఈ శరీరముతో ననుభవించు సుఖములకుమించి మఱియొండు అలౌకిక సుఖమేమియులేదు.

"అంగనాలింగనాజన్యసుఖమేవ పుమర్థతా" 'స్త్రీ పురుష శరీరసంబంధము వలన కలుగుసుఖమే పురుషార్థము', ఈ జన్మమున సాధింపదగిన దంతకుమించి యేమియున్నది ? మనుజులనుభవించు సుఖములన్నియు దుఃఖములతో కూడియుండును. కావున ఆ సుఖములను గూడ దుఃఖములుగానే భావించి వానిని విడుచుట బుద్ధిమంతుల లక్షణము కాదు. లేని ఈశ్వరుని ఆరాధించి యేదో శాశ్వతసుఖము ననుభవింపగోరుట మూర్ఖత యగుననియు అందులకై యమనియమాదులను పాటించుచు శరీరమును కృశింపజేయుట యంతకంటె అజ్ఞానమనియు చార్వాకు లభిప్రాయ పడుదురు.

**2. జైనమతము :-**

జైనమతప్రవర్తకులు తీర్థంకరులు. వీరు మహావీర స్వామి ప్రభృతులు ఇరువదినలుగురు. వీరు చార్వాకులవలె కాక ప్రత్యక్షము, అనుమానము, శబ్దము, అను మూడు ప్రమాణముల నంగీకరింతురు. జైనుల దృష్టిలో ప్రత్యక్షమువలన భౌతికపదార్థముల జ్ఞానము కలుగును. అనుమానము వలన ఆకాశము, కాలము, ధర్మము, అధర్మము తెలియునందురు.

జైనులు ఆకాశముతో కలిపి ఐదుభూతముల నంగీకరింతురు. ఆకాశము, కాలము, ధర్మము అధర్మములే కాక, ప్రత్యక్షానుమాన ప్రమా

ణముల ద్వారమున సజీవపదార్థములందు చేతనపదార్థము కలదనియు, నది జీవుడనబడుననియు నంగీకరింతురు. ప్రత్యక్షము మాత్ర మంగీకరించిన పక్షమున జడపదార్థ సంయోగమువలన చేతన ముద్భవించుననుటకు ప్రత్యక్షదృష్టాంతమే లభింపదు. కావున అనుమాన ప్రమాణమంగీకరింపక తప్పదందురు. జీవుడు లేకున్న శరీరము చలింపనేరదనియు వారు వాక్రుత్తురు.

జైనులు ప్రాణులలోనేకాక, వృక్షాదులందును జీవులున్నట్లంగీకరింతురు. ప్రతి జీవునకును అనంతదర్శనము, అనంతజ్ఞానము, అనంతవీర్యము, అనంత సుఖము పొందుటకు శక్తి కలదందురు. ఈశక్తి యుక్తులన్నియు జీవులకు స్వాభావిక గుణములని వారిమతము. జీవుల యాయాంతరిక స్వరూపము వారికర్మల మూలమున దాగియుండును. జీవులుకోరి, కర్మల ద్వారమున శరీరమును ధరింతురు. ఇట్లు జీవులు బంధనమున బడుదురు. కర్మలను వీడి బంధముక్తులగుదురు. ముక్తులైన జీవులు స్వాభావిక గుణములతో ప్రకాశింతురని జైనులంగీకరింతురు.

తీర్థంకరుల జీవనము, వారి యుపదేశములును మోక్షప్రాప్తి సర్వవిధముల సంభవమనుటకు ప్రమాణములు. వారు మోక్షప్రాప్తికి మార్గప్రదర్శకులు (1) సమ్యక్ దర్శనము జైన మహాత్ముల యుపదేశములందు శ్రద్ధాభావము (2) సమ్యక్ జ్ఞానము వారి యుపదేశముల యథార్థబోధ, (3) సమ్యక్ చరిత్ర - నైతిక నియమానుకూలాచరణము నను మూడును ముక్తికి సాధనములు. ఇందు సమ్యక్ చరిత్ర యనగా అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, అపరిగ్రహమునను యమములను పాలించుటయే.

జైనులు ఈశ్వరు నంగీకరింపరు. తీర్థంకరులే వారికి ఈశ్వరస్థానీయులు. తీర్థంకరుడు ఈశ్వరునివలె సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు నని యంగీకరింతురు. జైనుల జీవునకు తీర్థంకరులే యాదర్శస్వరూపులు.

జీవులయెడ దయాభావము కలిగియుండుట జైనమతస్థుల కొకవిశేష గుణము. జైనదార్శనికులు ప్రతివస్తువును అనంతధర్మకమని యందురు. ప్రతివస్తువు దృష్టిభేదము కారణముగా భావాత్మకము, అభావాత్మకము నగును. వస్తువుయొక్క సత్యత మనదృష్టి విశేషముపై అధారపడి

యుండును. కావున జనులు తమ యభిప్రాయమును ప్రకటించుటలో జాగరూకత చూపవలయును. అభిప్రాయమును ప్రకటించుటలో అసత్యత రాకుండునట్లు చూడవలయును. వ్యక్తి తనయభిప్రాయమును ప్రకటించునపుడు తనఉక్తికి 'స్యాత్' - 'కావచ్చును' అను పదమును జోడించుట యుక్తమందురు. అట్లు చేయుటవలన ఘృతర్ల యభిప్రాయము కూడ సత్యము కావచ్చుననుటకు నవకాశముండునని వారిభావము.

జైనదర్శనములు ఈశ్వరాస్తిత్వమును అంగీకరింపవు. కాని అనేక తత్త్వములయునికి నంగీకరించును. బాహ్యజగత్తు యొక్క యస్తిత్వము నంగీకరించును.

3. బౌద్ధ దర్శనములు :-

బుద్ధభగవానుడు చేసిన యుపదేశముల నాధారము చేసికొని బౌద్ధదర్శనముల రచన జరిగినది. బుద్ధుడు మానవులకు గలుగు జరామరణ రూపదుఃఖములను జూచి దుఃఖితుడై, ఆ దుఃఖకారణముల నెఱిగి వానిని రూపుమాపగోరి బహుకాలము తపమాచరించెను. అంతమున నతనికి బోధ కలిగి బుద్ధుడైనాడు. ఆబోధసారము ఆర్యసత్యచతుష్టయ మనదగును. ఆ సత్యము లెవ్వియన :- (1) దుఃఖము (2) దుఃఖకారణము (3) దుఃఖహాని (4) దుఃఖనాశనమునకు ఉపాయము.

లోకమున దుఃఖము నంగీకరింపనివారు లేరు - కాని బుద్ధుడు దుఃఖమనునది కొండొక విశేషావస్థలో నేర్పడు నదియని యెంచడు. అయ్యది సర్వావస్థలందును సర్వదా సర్వజీవులు ప్రపంచమున ననుభవించుచున్నారని బుద్ధుని సూక్ష్మ దృష్టి కవగత మయ్యెను. కావున సుఖానుభూతియు వాస్తవమున నతని దృష్టిలో దుఃఖమే యగుచున్నది.

దుఃఖము కారణములేక కలుగదు. కారణము లేక యేదియు కలుగదని బుద్ధునిభావము. ప్రపంచ వస్తువులన్నియు కార్య కారణభావబద్ధములని యతని సిద్ధాంతము.

అందువలన వస్తువులన్నియు అనిత్యములే. జన్మజరామరణాది దుఃఖములు కూడ నిత్యములు కావు. అవియు కారణ జనితములే. జన్మమునకు కారణము తృష్ణ. అది సాంసారిక విషయముల వంకకు ఆకర్షించును. అజ్ఞానము వలన మనుజులలో తృష్ణ యేర్పడును. విషయ

ముల యథార్థ జ్ఞానము సంపాదించి వాని క్షణికతను, దుఃఖజనకతను గుర్తించినవాడు జనులకు తృష్ణ కలుగదు. అది లేనియెడల పునర్జన్మ ముండదు. జన్మమే లేనినాడు దుఃఖము లుండవు. వాని కంతము - నాశము కలుగును. మూడవ సత్యము దుఃఖనాశము. దుఃఖకారణము నశించిన దుఃఖము నశించును.

నాల్గవసత్యము దుఃఖనాశమునకు ఉపాయము. ఇయ్యది అష్టమార్గ మనబడును. ఇందు ఎనిమిది సాధనములున్నవి. 1. సమ్యక్‌దృష్టి 2. సమ్యక్ సంకల్పము 3. సమ్యక్ వాక్కు 4. సమ్యక్కర్మాంతము 5. సమ్యక్ ఆజీవము 6. సమ్యగ్ వ్యాయామము 7. సమ్యక్‌స్మృతి 8. సమ్యక్‌సమాధి ఈ సాధనములవలన అవిద్య, తృష్ణ రెండును నశించును. అందువలన మనస్సున దృఢత, శాంతి యేర్పడును. ఇట్లు దుఃఖములు నశించి, పునర్జన్మము కలుగనేరదు. ఈ స్థితినే బౌద్ధులు నిర్వాణ మందురు. బుద్ధుని యుపదేశసారమంతయు పైన జూపిన నాలుగు ఆర్యసత్యములందే నిహితమై యున్నది.

బుద్ధునకు తరువాత వారిశిష్యులలో ననేకులు బుద్ధుని యుపదేశాంతర్గత దార్శనికభావములను వివరించి యున్నారు.

క్రమముగా బుద్ధుని అనుయాయులలో ననేకశాఖ లేర్పడినవి.

1. మాధ్యమిక వాదము - శూన్యవాదము :-

ఈ మతము ననుసరించి ప్రపంచమంతయు శూన్యమనబడును. బాహ్యాభ్యంతర విషయములన్నియు అసత్ పద వాచ్యములే.

2. యోగాచార మతము - విజ్ఞానవాదము :-

బాహ్యపదార్థములన్నియు నీమతమున అసత్యము లనబడును. బాహ్యమున గోచరించు పదార్థము చిత్తప్రతీతికి మించి మఱియొండేమియు కాదు. చిత్తమునకు మాత్రమే అస్తిత్వముండును చిత్తము లేదనుట తగదు. అదిలేనినాడు విచారమునకు ప్రసక్తియే యుండదు. అభ్యంతర వస్తువులు లేక చిత్తవిచార మేర్పడదు. కావున వస్తువులన్నియు అభ్యంతరములే. వానికి సంబంధించిన చిత్తప్రతీతియే బాహ్య పదార్థము, వాస్తవమున బాహ్యపదార్థము లేనే లేదు. ఇదియే విజ్ఞానవాదము.

3. సౌత్రాంతికము :-

ఈ మతము నంగీకరించు బౌద్ధులు బాహ్యాభ్యంతర వస్తువులు ఉభయములు సత్యములే యందురు. బాహ్యావస్తువు లేనినాడు కొండొకవస్తు జ్ఞానము కలుగవలయుననిన బాహ్యావస్తువు నపేక్షింపవలసిన యావశ్యకమే యుండకుండవలయును. మనస్సులోనే వస్తుజ్ఞానము కలుగవలయును. అట్లు కాక బాహ్యవస్తు వపేక్షింపబడుచున్నది. కావున బాహ్యావస్తువులను కూడ నంగీకరింపవలయునని వారిమతము.

4. వైభాషికులు :-

వైభాషిక మతమునకు సౌత్రాంతిక మతముతో మిక్కిలి సామ్యము కనిపించును. వీరును బాహ్యాభ్యంతర వస్తుసత్తనంగీకరింతురు. వైభాషికులు బాహ్యావస్తువులు ప్రత్యక్షములగునందురు. సౌత్రాంతికులు బాహ్యావస్తువులను ప్రత్యక్షమనక అనుమానికము లందురు.

ధార్మిక ప్రశ్నల నాధారము చేసికొని బౌద్ధులలో రెండు సంప్రదాయము లేర్పడినవి. అందొకటి హీనయానము. మఱియొకటి మహాయానము.

హీనయానము దక్షిణ భారతమునందును, బర్మా, అస్సామ్, లంకలలోను వ్యాపించినది. మహాయానము టిబ్బత్, చైనా, జపానులలో వ్యాపించినది. శూన్యవాదము, విజ్ఞాన వాదములు రెండును మహాయానాంతరతములు - సౌత్రాంతిక వైభాషికములు హీనయానాంతర్గతములనవచ్చును.

నిర్వాణమననేమి ? అను సమస్యను పరిష్కరించుటలో నీసంప్రదాయభేద మేర్పడినట్లుతోచును. నిర్వాణము ద్వారమున వ్యక్తి తన దుఃఖములను నశింపజేయును. కావున నది యభీష్టమని హీనయానులమతము. మహాయానులు నిర్వాణమున కుద్దేశము కేవలము తన దుఃఖముల నంతముచేయుట కాదు. నిర్వాణమున కుద్దేశము పూర్ణజ్ఞానము సంపాదించి, తన్మూలమున దుఃఖగ్రస్త సమస్తప్రాణులను దుఃఖములనుండి విముక్తులనుజేయుటయు నని యంగీకరింతురు.

న్యాయ దర్శనము :- ఈ దర్శనము పదార్థవాదమునకు జెందినది. ఇది యుక్తిప్రధానము. దీనికి కర్త గౌతమ మహర్షి. ఇందు ప్రత్యక్షాది నాలుగు ప్రమాణములు ప్రధానముగ నంగీకరింపబడును.

1. ప్రత్యక్షము :- ప్రతి ఇంద్రియము ప్రత్యక్ష ప్రమాణమనబడును. ఐంద్రియిక జ్ఞానము ప్రత్యక్షము లేక అపరోక్షమనబడును. ఈ జ్ఞానము ఇంద్రియార్థ సన్నికర్షమువలన కలుగును. కాని, యది భ్రమాత్మకము కాని, సంశయాత్మకముకాని వస్తు సంజ్ఞాశ్రవణమువలన కలిగినది గాని కారాదు.

2. అనుమానము :- ఇది ప్రత్యక్షపూర్వక మగును. ధూమమును ప్రత్యక్షముగా చూచి అది యున్నతావున అగ్ని యున్నదని యూహించి తెలిసికొందుము. ఇందు ధూమము అనుమాపకము. అగ్ని అనుమితము. ఈ యనుమానము ముఖ్విధములు (1) పూర్వవదనుమానము:- కారణమును చూచి కార్యము నూహించుట, మేఘోన్నతిని జూచి రాబోవు వర్షము నూహించుట (2) శేషవదనుమానము:- కార్యమును జూచి కారణము నూహించుట. సుఖదుఃఖములను జూచి తత్కారణములైన శుభాశుభకర్మల నూహించి తెలిసికొనుట, పుత్రుని జూచి తండ్రిని తెలిసికొనుట. (3) సామాన్యతో దృష్టానుమానము:- కార్యత్వసామాన్యమును జూచి కర్త నూహించుట. సృష్టియందలి రచనా విశేష రూప కార్యత్వమును జూచి తత్కర్తయగు పరమేశ్వరు నూహించుట.

అనుమానప్రమాణమునందు సాధ్యసాధనములకు గల నియతసాహచర్య జ్ఞాన మెంతయు ముఖ్యమగును. అగ్ని సాధ్యకమగు అనుమానమునందు ధూమాగ్నులకుగల నియతసాహచర్యము తెలియనివాడు ధూమమున్నచోట అగ్ని యుండునని ధూమమును జూచి తెలిసికొనజాలడు.

3. ఉపమానము :- సాదృశ్యజ్ఞానము ఉపమానప్రమాణమనబడును. రెండువస్తులలోనుండు సాదృశ్యజ్ఞానము కలవాడు అసాదృశ్యమువలన తెలియని వస్తువును తెలిసికొనును. గోసాదృశ్యము గవయమునందుండుట చూచి గవయమును తెలిసికొనును.

4. అప్తులు చెప్పు వాక్యము శబ్దప్రమాణము :- చారిత్రకులు చెప్పు వాక్యములు విని గతించిన అశోకాది చక్రవర్తుల జ్ఞానము కలుగును. పరమా

ప్పుడగు పరమేశ్వర ప్రదత్తవేదము శబ్దప్రమాణముగా ఆస్తికులంగీకరింతురు.

ఇతరములగు ఐతిహ్యము, అర్థాపత్తి, అసంభవము, అభావము నను ప్రమాణము లన్నియు పైనాలుగు ప్రమాణములలో అంతర్భూతములుగా నైయాయికు లంగీకరింతురు.

ప్రమాణము, ప్రమేయము, సంశయము, ప్రయోజనము, దృష్టాంతము, సిద్ధాంతము, అవయవము, తర్కము, నిర్ణయము, వాదము, జల్పము, వితండ, హేత్వాభాసము, ఛలము, జాతి, నిగ్రహస్థానము అను పదునాఱు పదార్థములను గూర్చి న్యాయదర్శనము చర్చించును. ఈ తత్త్వముల జ్ఞానము నిశ్శ్రేయసము - మోక్షమునకు సాధనమని నైయాయికుల సిద్ధాంతము. వారు జీవేశ్వరులను ప్రత్యేకపదార్థములుగా నంగీకరింతురు. 'ఇచ్ఛా, ద్వేష, సుఖ, దుఃఖ, ప్రయత్న, జ్ఞానములు' జీవాత్మకు లింగములు. ఈశ్వరుడు వ్యాపక తత్త్వము, జీవులకు కర్మఫలముల నొసంగును. అతడు సృష్టిస్థితి లయములకు కర్త.

## 2. వైశేషిక దర్శనము :-

కణాదమహర్షి యీ దర్శనమునకు కర్త. ఈ దర్శనము కూడ న్యాయదర్శనమువలెనే పదార్థ వివేచనము చేయును. ఇదియును తత్త్వజ్ఞానమువలననే ముక్తి లభించునని యంగీకరించును.

ద్రవ్య, గుణ, కర్మ, సామాన్య, విశేష, సమవాయాభావములు పదార్థములనియు, వాని యథార్థజ్ఞానమువలన ముక్తి లభించునని వైశేషిక సిద్ధాంతము.

ఈ దర్శనకర్తయు జీవేశ్వరులను భిన్నపదార్థములుగా నంగీకరించును. న్యాయదర్శనమున వర్ణింపబడిన 'ఇచ్ఛాద్వేషాది' గుణములేకాక, ఉచ్ఛ్వాస నిశ్శ్వాసములు, నిమేషోన్మేషములు, జీవనము, మనోగతి, ఇంద్రియాంతర వికారములు కూడ జీవలక్షణములుగా నీదర్శన మంగీకరించును. ఈశ్వరుని స్వరూపవిషయమున న్యాయ వైశేషికములందు వైమత్యము లేదు. జీవేశ్వరు లనునవియు ద్రవ్యములే యని కణాదు డంగీకరించును. అవి కల్పితభావపదార్థములు కావు.

ప్రపంచము, తద్గత పదార్థములు నన్నియు పరమాణువుల సంయోగ

విశేషమువలన నేర్పడునని వైశేషికమతము. పరమాణువు లనేకములు. ఆపరమాణువులును పరస్పర భిన్నములనియు, వానియందలి భేదమును నిరూపించుటకు వానిలో విశేషనామకపదార్థ మొండు కలదని కణాదు డంగీకరించును. అందువలననే యీదర్శనమునకు వైశేషిక దర్శనమని పేరు కలిగినట్లు దార్శనికులు చెప్పెదురు.

పృథివి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, కాలము, దేశము, ఆత్మ, మనస్సు అనునవి ద్రవ్యములు.

రూపము, రసము, గంధము, స్పర్శ, శబ్దము, సంఖ్య, పరిమాణము, పృథక్త్వము, సంయోగము, విభాగము, పరత్వము, అపరత్వము, ద్రవత్వము, స్నేహము, బుద్ధి, సుఖము, దుఃఖము, ఇచ్ఛ, ద్వేషము, ప్రయత్నము, గురుత్వము, సంస్కారము, ధర్మము, అధర్మము అను నీ 24 గుణములు. ఇవి ద్రవ్యముల నాశ్రయించి యుండును.

గమనాదులు కర్మలు. ఇవియును ద్రవ్యము నాశ్రయించియే యుండును. మానవత్వ, పృథివీత్వాదులు సామాన్యములు. ఇయ్యవి జాతిపదముతోను చెప్పబడును.

పరిమాణములలో గల భేదమును తెలుపు పదార్థములు విశేషములు అనబడును. ఇట్లు పైన వర్ణింపబడిన ద్రవ్యాది పదార్థముల లక్షణపరీక్షాదులే వైశేషిక దర్శనము.

**3. సాంఖ్యదర్శనము :-**

ఇయ్యది కపిలమహర్షి కృతి, ఇందు ప్రకృతిపురుషుల వివేచనము చూడనగును - ప్రకృతి, పురుషులు స్వతంత్రసత్తగలవై యున్నవి.

పురుషుడు చేతనుడు. చైతన్యము ఇతనికి స్వరూపము. ఇతడు శరీరము, మనస్సు, ఇంద్రియములు అనువాని కన్నింటికంటె భిన్నుడు. ఇతడు నిత్యుడు. ఇట్టి చేతనములు ఎన్నియో యున్నవి. ఇవియే జీవ పదవాచ్యములు.

ప్రకృతి జడతత్త్వము. ఇది యీ ప్రపంచమునకు ఉపాదానకారణము, నిత్యము, పరివర్తనశీలము కలదై పరిణామము బొందుచుండును. సత్త్వ రజస్తమస్సులనునవి దీని స్వభావము. ఇవి గుణపదవాచ్యములు. సృష్టికి

పూర్వమివి సామ్యావస్థయందుండును. అప్పుడే ప్రకృతి పదముతో నవి చెప్పబడును. సత్త్వము ప్రకాశకము. రజస్సు చలనము - తమస్సు అచలనము - ఆవరణక మనదగును.

పురుషుని సాన్నిధ్యమువలన ప్రకృతివికృతి కాదొడగును. దానియందు స్థాల్యము - సత్త్వరజస్తమస్సులలో వైషమ్యము ఏర్పడును. ఇదియే సృష్టికి ఆరంభము. ప్రకృతి నుండి యేర్పడు సృష్టి క్రమములో మొదటిసృష్టి మహ త్తత్త్వము. ఇయ్యది బుద్ధి యనబడును. దాని నుండి అహంకారము, దాని నుండి పంచతన్మాత్రలు, పంచ జ్ఞానేంద్రియములు, పంచకర్మేం ద్రియములు మనస్సు జనించును. అటుపై పంచతన్మాత్రల నుండి పంచస్థూల భూతములు పృథివ్యాదులు జనించును. ఇట్లు ప్రకృతి 24 తత్త్వములుగా లెక్కింపబడును. పురుషుడొకతత్త్వము, కలిసి పంచవి శంతి 25 తత్త్వములు సాంఖ్య శాస్త్రమున ప్రసిద్ధములు. తత్త్వసంఖ్యను బట్టియే సాంఖ్యదర్శన మనబడును.

పురుషుని సాన్నిధ్యముచే బుద్ధి చేతనాయమానమై సమస్తకార్యములు చేయుననియు, బుద్ధిచే చేయబడు కార్యములు జీవునకు ఉపలబ్ధము లగుననియు, అందువలన తానే కర్తయని జీవుడెంచుననియు సాంఖ్యులు చెప్పుదురు. ఇట్లు బుద్ధికి తనకు గలభేదమును గుర్తింపక యున్నంత కాలము జీవుడు ప్రకృతి బద్ధుడై ప్రాకృతికములగు పదార్థ సంయోగము వలన సుఖదుఃఖముల ననుభవించు నందురు. తాను వేఱు, బుద్ధి వేఱు అని జీవునకు వివేకము కలిగిననాడు జీవుడు బంధముక్తుడై కైవల్యు డగును. ప్రకృతి పురుష వివేకమే ముక్తికి సాధనము.

ఈ దర్శనమును కొందఱు నిరీశ్వర మందురు. వైదికులు అయ్యది యంగీకరింపరు. సాంఖ్యము శ్రుతిప్రామాణ్యము నంగీకరించును. కావున నయ్యది నిరీశ్వరవాదము నంగీకరింపదు. "ఈశ్వరాసిద్ధేః" అను నీ సూత్ర మునకు ప్రత్యక్ష ప్రమాణముతో నీశ్వరుడు సిద్ధింపడని యర్థము. కాని, ఈశ్వరుడు లేడనుట ఈ దర్శనాభిప్రాయము కాదు. అనుమాన శబ్ద ప్రమాణములచే సిద్ధింపబడు పరమేశ్వరుని సాంఖ్యము నిరాకరింపదు. పరమేశ్వరుని నంగీకరింపని పక్షమున "ఈశ్వరాసిద్ధేః" అని సూత్రింపక "ఈశ్వరాభావాత్" అని కపిలుడు సూత్రించి యుండెడివాడు.

ముఖ్యముగా నీదర్శనమున ప్రకృతి, జీవులు ననువానిని గూర్చి విశేషముగ వివరింపబడినది - ఈశ్వరవిషయ మంతగా చర్చింపబడలేదు.

4. యోగదర్శనము :-

ఇయ్యది పతంజలి మహర్షికృతము. సాంఖ్యయోగములు రెండును విశేషసామ్యము కలిగి యుండును. ఇందు -

"క్లేశకర్మ విపాకాశయైః అపరామృష్టః పురుషవిశేష ఈశ్వరః"

"తస్య వాచకః ప్రణవః"

అను నిట్టి సూత్రముల మూలమున పతంజలి మహర్షి యోగదర్శనమున ఈశ్వరుని ప్రత్యేకముగా నిర్దేశించియున్నాడు. ఈ దర్శనము ఈశ్వరుని సాక్షాత్కారమునకు వలయు సాధన సంపత్తిని గూర్చి వివరించును. ఇయ్యది అష్టాంగ యోగమనియు చెప్పబడును. యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సమాధులు అంగములు.

చిత్తవృత్తుల నిరోధించుటయే యోగము. చిత్త వృత్తి నిరోధము చిత్తైకాగ్రత సమాధి యనబడును. సంప్రజ్ఞాతము, అసంప్రజ్ఞాతము నని సమాధి ద్వివిధము. సంప్రజ్ఞాత సమాధి యందు ధ్యానకర్త, ధ్యేయములు విడివిడిగా భాసించును. అసంప్రజ్ఞాతమున నా భేదము తెలియబడక ధ్యేయము మాత్రము తెలియబడును.

యోగదర్శనమునందు ఈశ్వరసాక్షాత్కారమునకు వలయు సాధనసంపత్తి, సాక్షాత్కార ప్రయోజనము విశేషముగ వర్ణింపబడినవి.

5. పూర్వమీమాంస :-

ఈ దర్శనమును రచించిన మహర్షి జైమిని. ఇతడు వ్యాస శిష్యుడు. ఈ దర్శనము సహస్రాధికరణములు కలిగి మిగిలిన దర్శనము లన్నింటికంటెను బృహత్కాయము కలిగియుండును. ఇందు వైదికకర్మకాండ విశేషముగ చర్చింపబడినది. మఱి యొకవిధముగ నిది బ్రాహ్మణవాక్యసమన్వయ మనవచ్చును. నానావిధయజ్ఞములు, వానిప్రక్రియలు, వానివిధులు ఇందు చూడనగును.

మీమాంసకులకు వేదము అపౌరుషేయము. అది నిత్యము. వీరికి

శబ్దప్రమాణమే ప్రధానము. ఈ దర్శనమున ప్రమాణములను గూర్చి విశేషముగ చర్చింపబడును. జ్ఞానము - వేదము - స్వతఃప్రమాణము. వేదవిహితమే ధర్మము. వేద నిషిద్ధము అధర్మము. వేదవిహితకర్మలు - సంధ్యాగ్ని హోత్రాదులు ఫలాపేక్ష విడిచి కర్తవ్యబుద్ధితో నాచరించు వారు ముక్తులగుదురు. మీమాంసకులలో నొకయాచార్యుడు ప్రభాకరుడు. ప్రత్యక్షము, అనుమానము, ఉపమానము, శబ్దమేకాక అర్థాప్రపత్తి అను నైదవప్రమాణము కూడ నంగీకరించును. కుమారిల భట్టు మతము ననుసరించువారు 'అనుపలబ్ధి' అను నాఱవ ప్రమాణమును గూడ నంగీ కరింతురు.

మీమాంసకులు జగత్ సత్యత్వమును అనేకాత్మలను అంగీకరింతురు. ఈశ్వరుని గూర్చి యీశాస్త్ర మంతగా చర్చింపదు.

6. వేదాంతదర్శనము - ఉత్తరమీమాంస :-

ఇయ్యది వ్యాసమహర్షి ప్రణీతము. ముఖ్యముగా నిది సృష్టిస్థితిలయ ములకు కారణమైన బ్రహ్మమును గూర్చి చర్చించును. అందువలననే యీదర్శనమునకు బ్రహ్మసూత్రములనియు నామాంతరమున్నది. ఉప నిషత్తులలో గల వైదిక సిద్ధాంతములను సమన్వయించుట కీదర్శనము విశేషముగ ప్రవర్తించును.

ఈ దర్శనమునకు శ్రీశంకర, రామానుజ, మధ్వాచార్యాదులు భాష్యములను రచియించి అద్వైత, విశిష్టాద్వైత, ద్వైతాది సంప్రదాయ ములను ప్రచారము చేసియున్నారు.

ఈ దర్శనమునకు సంబంధించిన విషయముల నీయల్ప నిబంధము నందు సమగ్రముగ చర్చించుట సంభవము కాదు. అద్వైతాది మతాచా ర్యులు తమతమ భాష్యములందు చర్చించిన విషయములు ఎంతవఱకు సూత్రానుసరణములో, చర్చించుట దుర్ఘటము. ఆయా ఆచార్యులు వేదములను, వేదసిద్ధాంతములను ఎంతవఱకు అనుసరించిరో నిర్ణయిం చుటకును నిది స్థలము కాదు. వేదాంతదర్శనము చిన్నది కాదు. ఇది యొక బృహద్గ్రంథము. ఈ గ్రంథమునకు ప్రత్యేకముగా తెలుగు భాష యందు నేనొక వ్యాఖ్యానము వ్రాసియున్నాను. అచిరకాలములో నది పాఠకుల కందింపజేయగలనని భావించుచున్నాను.

న్యాయవైశేషికాది దర్శనములకు తెలుగు వ్యాఖ్యానములు వ్రాసి యింతకు పూర్వమే ప్రకటించియున్నాను. పాఠకులు కొందఱైనను వానిని జూచియుందురు.

"దర్శనములు" అను విషయము మిక్కిలి పెద్దది. ఒక్క లేఖ యందు ప్రపంచదర్శనములను గూర్చి వ్రాయుట నాయట్టి అల్పజ్ఞులకు అసంభవము. నాకు పాశ్చాత్య దర్శనజ్ఞాన మిసుమంతయు లేదు. ప్రాచ్య దర్శనములలో భారతీయ దర్శనములను గూర్చి పాఠకులకు ఒకింత దిగ్దర్శనము చేయింప నుద్దేశించి కొన్ని పంక్తులు వ్రాసితిని. పాఠకులు దీనిమూలమున దర్శనములను పఠించి తన్మూలమున భారతీయ జ్ఞానసంపదను పొందుదురుగాక !

24-9-1970 - గోపదేవ్

# ఆర్యసమాజమననేమి ?

## ఆర్యసమాజము

ఆర్యసమాజమననేమి? భారతదేశవాసులలో చాలమందికి ఆర్యస మాజమన నేమో తెలియదు. ముఖ్యముగా భారతదేశములో దక్షిణ భాగమున నివసించు ఆంధ్ర, కర్నాటక, మళయాళ, తమిళభాషలను భాషించు కోట్లాది జనులు ఆర్యసమాజమును గూర్చి యేమియు నెఱు గరనియే ఖచ్చితముగా చెప్పవచ్చును. చదువని వారేకాదు చదువరులమని చెప్పుకొనువారు కూడ ఆర్యసమాజ మననేమో యెఱుగరనియే చెప్పిన అతిశయోక్తి కాదు. పైన ఉదాహరించిన భాషలవారిలో రాజనైతిక పక్షా లకు చెందిన నాయకులు కూడ ఆర్యసమాజమును బాగుగ తెలిసినవారు మిక్కిలి యల్పసంఖ్యాకులనియే చెప్పవలసి వచ్చుచున్నది. దక్షిణభారత దేశీయులలో నూటికి తొంబది మంది 'ఆర్యసమాజము' అను నామ మును కూడ వినియుండరు. ఎవరైన 'ఆర్యసమాజమంటే యేమిటో మేమెఱుగుదుము' అని చెప్పువారు కొందఱున్నను వారు వ్రేళ్లమీద లెక్క బెట్టదగిన వారేయనవలెను. వారుకూడ సమాజమును యధార్థ రూపమున నెఱుగరు. వారు ఆర్యసమాజమును ముస్లిమ్ విరోధి సమా జమనియో లేక క్రైస్తవ విరోధి సమాజమనియో చెప్పుదురు. ఇట్టివారిలో కొందఱు ఆర్యసమాజమును నాస్తిక సమాజమనియు, ఇంక కొందఱు హిందూసంస్కరణ సమాజమనియు, మఱికొందఱు విధవావివాహములను చేయుటకొఱకేర్పడిన సమాజమనియు జెప్పుదురు. వీరెల్లరు ఆర్యసమాజ మననేమో యెఱుగరనియే చెప్పవలయును. ఈనావాక్యములను చదివిన తరువాత పాఠకులకు 'అటులయిన ఆర్యసమాజమననేమి?' అను ప్రశ్న అవశ్యము కలుగును.

ఆర్యసమాజమనగా శ్రేష్ఠులైన మానవుల సంఘము. ఆర్యులు అనగా ఉత్తమమానవులు. సమాజము అనగా మానవుల సమూహము. ఆర్య పదము సంస్కృతమున 'ఋగతౌ' అను ధాతువువలన నేర్పడును.

ఇందు 'ఋ' ధాతువు 'గతౌ' అని యర్థము. 'గతి' శబ్దమునకు జ్ఞానము, గమనము, ప్రాప్తి అని మూడు అర్థములు. అందువలన అర్యుడన జ్ఞానముకొఱకు ప్రయత్నించువాడనియు, గతిశీలుడు, సోమరియై యుండక సత్కర్మల నొనర్చు కర్మయోగియు, తనకు లేనిదానిని శ్రమించి సంపాదింప యత్నించువాడనియు తెలియనగును. అట్టి మనుజుల శ్రేష్ఠుల సముదాయమే ఆర్యసమాజము, అని తేలుచున్నది. ఇది ఆర్యసమాజము శబ్దార్థము.

ఇట్టి యర్థవిశేషముగల ఆర్యసమాజము క్రీ.శ. 1875లో శ్రీమద్దయానందమహర్షిచే బొంబాయి నగరమున స్థాపింపబడెను. ఈ సమాజము ముఖ్యముగా వేదసిద్ధాంతములను - వేదబోధితధర్మములను మానవలోకమున ప్రచారముచేయ స్థాపింపబడినది. మఱియొక విధమున చెప్పిన ఆర్యసమాజము ప్రపంచదేశవాసులైన మానవులలోగల మూఢవిశ్వాసములను, మూఢాచారములను దొలగించి, వారిలోగల అవిద్యా అజ్ఞానాంధకారమును పోగొట్టి వారికి జ్ఞానోదయమును కలిగింప నేర్పడిన సంస్థయనియు చెప్పవచ్చును. మహర్షి దయానంద సరస్వతీస్వామి ఆర్యసమాజమును స్థాపించుటలోగల ఉద్దేశమును ఆ సమాజపు పది (10) నియమములలో సుస్పష్టము చేసియున్నారు. ఆ నియమవ[illegible] లెయ్యవియన :-

1. సమస్తసత్యవిద్యలకును, విద్యవలన నెఱుంగదగు పదార్థములకు నాదిమూలము పరమేశ్వరుడు.

2. ఈశ్వరుడు సచ్చిదానంద స్వరూపుడు, నిరాకారుడు, సర్వశక్తిమంతుడు, న్యాయకారి, దయాలుడు, అజన్ముడు, అనాథ్యనన్తుడు, నిర్వికారుడు, అనుపముడు, సర్వాధారుడు, సర్వేశ్వరుడు, సర్వవ్యాపకుడు, సర్వాన్తర్యామి, అజరుడు, అమరుడు, అభయుడు, నిత్యుడు, పవిత్రుడు, సృష్టికర్తయునై యున్నాడు. అతనినే యుపాసింపవలయును.

3. వేదము సత్యవిద్యల గ్రంథము. దీని యధ్యయ నాధ్యాపనములు, శ్రవణశ్రావణములు నార్యులకందఱికి పరమ ధర్మము.

4. సత్యమును గ్రహించుటకును, అసత్యమును త్యజించుటకును నెల్లపుడు సిద్ధముగా నుండవలెను.

5. సర్వకార్యములను ధర్మానుసారముగా ననగా సత్యాసత్యములను విచారించి చేయవలెను.

6. ప్రపంచమున కుపకారము జేయుట యీ సమాజమునకు ముఖ్యోద్దేశము. అనగా శారీరికోన్నతి, ఆత్మికోన్నతి, సామాజికోన్నతి గలిగించుట.

7. అందఱితో ప్రేమపూర్వకముగా ధర్మము ననుసరించి యథోచితముగా వ్యవహార మొనర్పవలయును.

8. అవిద్యను నశింపజేసి విద్యను వెంపొందింప జేయవలెను.

9. ప్రతివ్యక్తియు తన యున్నతితోనే సంతుష్టుడు కాక యందఱి యున్నతిలో తన యున్నతి కలదని యెఱుంగవలయును.

10. సర్వజనహితకరములగు సామాజిక నియమములను పాలించుటలో పరతంత్రులై వ్యక్తిహితకరములగు నియమములందు స్వతంత్రులగుట అందఱికి తగును.

ఈ విధముగా ఆర్యసమాజ మననేమో తెలిసికొనిన మీదట ఈ సమాజము ముస్లిమ్, క్రైస్తవ విరోధి సమాజముకాదని స్పష్టమగును. ఇంతేకాక యిది నాస్తికసమాజము కాదనియు విధవా వివాహముల జేయనేర్పడిన సమాజము కాదనియు, హిందూసమాజమును మాత్రము సంస్కరింప నేర్పడిన సమాజము కాదనియు తెలియనగును. మఱియు ఆర్యసమాజము మతసంస్థయు కాదు. హిందు, ముస్లిమ్, క్రైస్తవ శైవ వైష్ణవ శాక్త శంకర రామానుజాది మతములను, సోషలిజం. కమ్యూనిజం, క్యాపిటలిజం, మార్క్సిజం, లెనినిజం. ఆది ఇజములనుగాని సమర్థింప నేర్పడిన సమాజము కాదు. ఈ సమాజము సార్వభౌమికములు సార్వజనీనములు సార్వకాలికములునగు సత్య సిద్ధాంతములను మానవసమాజమునకు బోధింపనేర్పడిన యొకసంఘము. మానవధర్మములను, విశ్వమానవజీవితపు మనుగడకు తోడ్పడు విశ్వమానవధర్మమును బోధించుటకు నేర్పడిన సంస్థ యననగును.

సంప్రదాయములు, ఇజములున్నియు మానవ వ్యక్తులచే నేర్పఱుపబడినవి. భిన్నభిన్న కాలములందు భిన్నభిన్న దేశములలో పుట్టి పెరిగిన

చారిత్రిక మహాపురుషుల యభిప్రాయములేయని చెప్పినను దోషముండదు. ఈసా, మహమ్మదు, బుద్ధ, జినాదులు, అట్లే శంకరరామానుజాద్యాచార్యులు నెల్లరు విశిష్ట జ్ఞానాదిగుణములుగల వ్యక్తులు కావచ్చును. ఐనను వీరెల్లరు మానవులు, జీవకోటికి చెందినవారు. జీవుడు అల్పజ్ఞుడు. సర్వజ్ఞుడెన్నడును కాడు. లోకములో వీరెంత గొప్పవారుగా నెంచబడినను జీవులేకావున వీరిలో అల్పజ్ఞత, రాగద్వేషాదులు నుండకపోవు. కావున వీరిచే స్థాపింపబడిన మతములు - సంప్రదాయములు దోషరహితములు - నిర్దుష్టము లెన్నడు కాజాలవు. అందువలననే ఆయామతముల ననుసరించువారిలో కలహములు కలుగుట సహజము. సామరస్యము కాని, ఐకమత్యము కాని వారిలో నేర్పడుటయు నసంభవము. మహాత్మాగాంధి ప్రభృతులెందఱో యెంతగానో ప్రయత్నించియు మతకలహములను మతవిద్వేషములను తొలగింపజాలకపోవుట జగమెఱిగిన విషయము. ఇప్పటికేని వారి యనుయాయులు మతసామరస్యము మతసహనమునకు ప్రయత్నించుచు విఫలులగుట మనము నిత్యము జూచుచున్నాము.

ఈ విభిన్నమత సిద్ధాంతముల ననుసరించు మానవులలో పరస్పర సహనము, పరస్పర సహజీవనము నేర్పడవలయుననిన వారు మానవధర్మములు పాటింపవలయును. ఆ ధర్మములే వేదధర్మములు, సత్యసిద్ధాంతములు, సర్వమానవ హితకరములు, కారణమేమన -

ఋగాది వేదములు మానవరచితములు కావు. అవి యీశ్వరీయములు. ఈశ్వరుడు సర్వజ్ఞుడు, సర్వప్రాణిహితకారి, రాగద్వేషాది దోషరహితుడు, నిత్యుడు, సర్వసృష్టి స్థితిలయకర్త, న్యాయకారి, దయాళువు, సచ్చిదానంద స్వరూపుడు, అజుడు, అజరుడు, అమరుడు, నిత్య శుద్ధబుద్ధ ముక్తస్వభావుడు వ్యాపకుడు, నిరాకారుడు, నిర్వికారుడు, సర్వాంతర్యామి. ఇట్టి యీశ్వర రచితములు కావున వేదములు ఋగాదులు సర్వజ్ఞకల్పములు, సర్వార్థబోధకములు, సర్వవిద్యోపబృంహితములు, అందువలన వానిలో భ్రమ ప్రమాదములకు తావుండదు. అందలి సిద్ధాంతములు సత్యములు, సర్వప్రాణి కళ్యాణదాయకములు అనుటలో సందియమావంతయు నుండరాదు. అట్టి సిద్ధాంతములను - ధర్మములను బోధించుట కేర్పడిన సమాజమే ఆర్యసమాజము. కొందఱనుకొనునట్లిది యొకక్రొత్త మత

మును లోకమున వ్యాపింపజేయుట కేర్పడినదికాదు. దయానందమహర్షి ప్రాచీనకాలము నుండి భారతదేశమునను, నెల్ల యితర దేశములందును సర్గాదినుండియు మానవులాచరించుచు వచ్చిన సత్యసిద్ధాంతములను స్మరింపజేయుటకే యీ సమాజమును స్థాపించియున్నాడు.

వేదము లీశ్వరీయములని భారతీయులైన ఋషులు, మునులు, ఆచార్యులు విద్వాంసులేకాదు పాశ్చాత్య దేశవాసులైన విద్వాంసులును అంగీకరింతురు. ఇందుకు ప్రమాణములు సంక్షిప్తముగా:-

"తస్మా ద్యజ్ఞాత్ సర్వహుతఋచః సామాని
జజ్ఞిరే, ఛందాగ్ంసి జజ్ఞిరే తస్మాద్
యజు స్తస్మాదజాయత" (యజు :)

ఈ మంత్రమునందలి యజ్ఞపదము వ్యాపకుడైన విష్ణు వాచకము (యజ్ఞోవై విష్ణుః శతపథము) అట్లే ఛందాంసియన అథర్వవేదము.

'వ్యాపకుడగు ఈ పరమేశ్వరునివలననే ఋక్కులు, సామములు, యజుస్సులు, అథర్వవేదము జనించినవి' అని మంత్రతాత్పర్యము.

"ఏతస్య హ మహతో భూతస్య నిఃశ్వసితమ్
ఏతద్ యద్ ఋగ్వేదో యజుర్వేదః సామవేదో
అథర్వవేదః" (బృ.అ.4-5)

(ఋగాది చతుర్వేదములు పరమేశ్వరుని నిఃశ్వాసముల వంటివి)

"అనాదినిధనా, నిత్యా, వాగుత్సృష్టా స్వయంభువా
ఆదౌ వేదమయీ దివ్యా యతః సర్వాః ప్రవృత్తయః"
(మ.భా.శాం.232.25)

(సర్గాదియందు ఆద్యంతములు లేని సత్యమైన దివ్యమునైన వేదమయమగు వాక్కు పరమేశ్వరునిచే ప్రకటింపజేయబడినది. ఆవేదవాణి నుండియే లోకమున సర్వవ్యవహారములు ప్రవర్తించినవి అని భావము).

"శాస్త్రయోనిత్వాత్" (వే.ద. 1-1-3)

'అనేక విద్యలతో గూడి, ప్రదీపమువలె సర్వార్థావద్యోతకమై, సర్వ

జ్ఞకల్పమై ఋగ్వేదాది మహచ్ఛాస్త్రమునకు యోనికర్త బ్రహ్మమే'. ఇట్టి లక్షణములు గలిగిన ఋగ్వేదాదిశాస్త్రము సర్వజ్ఞగుణాన్వితుడైన సర్వజ్ఞుడైన పరమేశ్వరునికంటె భిన్నుడైన వానివలన సంభవింపనేరదు అని శంకరాచార్యులు.

"బ్రహ్మ అక్షరసముద్భవమ్" (గీత. 3-15)

(బ్రహ్మ-వేదము నిత్యుడగు పరమేశ్వరుని వలన జనించినది).

వేదమీశ్వరీయమనుటకు పాశ్చాత్యుల సాక్ష్యము.

Jacolliot ఫ్రెంచి విద్వాంసుడు.

"Astonishing fact. The Hindu Revelation (Veda) is of all revelations the only one whose ideas are in perfect hormany with modern science, as it proclaims the slow and gradual formation of the world."

(బైబిల్ ఇన్ ఇండియా Vol.II Chap-1)

"హిందువుల ఈశ్వరీయజ్ఞానమగు వేదము మాత్రమే విశ్వము క్రమముగా నెమ్మదిగా పరిణమించినట్లు చెప్పుచున్నది. ఇతర ఈశ్వరీయ జ్ఞానము (బైబిల్ అది) లనబడునవేవియు నిట్లు చెప్పలేదు. వేదములోని సిద్ధాంతములు (Ideas) మాత్రమే అధునికవిజ్ఞానముతో సమానములైయున్నవి. ఇది యెంతటి యాశ్చర్యకరమైన విషయము అని పైవాక్యముల భావము.

ఇట్టి వేదసిద్ధాంతములు ఈశ్వరీయములు. కావున భ్రమ ప్రమాదరహితములనుటలో సందియ మిసుమంతయునుండదు. నేటిమానవులు వానిని విస్మరించి మిథ్యాచారముల ననుష్ఠించుచు దుఃఖముల పాలగుచున్నారు. వారినుద్ధరించుటకే మహర్షి యావజ్జీవము వేదసిద్ధాంతములను ప్రచారముచేసి యందులకై ప్రాణములు కూడ నర్పించిరి. తనయనంతరము లోకమున వేదసిద్ధాంతములను ప్రచారము చేయుటకే దయానందమహర్షి ఆర్యసమాజము నేర్పఱచిరి.

కావున ఆర్యసమాజ స్వరూప స్వభావకర్తవ్యాదులను గుఱించి బాగుగ నెఱిగి దానిమూలమున మానవులెల్లరు తమ జీవితవిధానమును తీర్చిదిద్దుకొన గోరుదు.

# ఆర్యన్ మ్యానిపెస్టో

(ఆర్యసమాజ పరిచయము)

ఆర్యసమాజము ఆస్తికసంప్రదాయము కలది. ఇది సృష్టిని రచించిన ఆదిప్రేరక చేతనశక్తి నంగీకరించును. మానవాభ్యున్నతి నిమిత్త మా చేతనశక్తి ద్వారా లభ్యమైన ఆదిజ్ఞానము నంగీకరించును. సనాతన వైదిక ధర్మము నంగీకరించును.

1. (క) ఆ యాదిప్రేరకశక్తి స్వరూపము, గుణకర్మ స్వభావ ములు, సత్యములు. అది కేవల చేతనము, అద్వితీయము, నిత్యము, త్రికాలాతీతము, పరివర్తనరహితము, సర్వజ్ఞము, సర్వశక్తిమంతము, నిరా కారము, సర్వవ్యాపకము, అనాది, అనంతము, దానినే ఈశ్వరుడందురు. ఈశ్వరుడొకడే, అనేకులు లేరు.

(ఖ) ఈశ్వరుడు నిరాకారుడు. ఆయనను కంటితో చూడజాలము. ఆయన కొకమూర్తిని నిర్మింపజాలము.

ఈశ్వరుడు సర్వజ్ఞుడు. సర్వవ్యాపకుడు. అతడు సమస్త విషయముల నామూలాగ్రముగా తెలిసికొనును. అల్పా నల్ప, దూరాదూర భేదములేక సర్వపదార్థముల బాహ్యాభ్యంతరముల నిండియున్నాడు.

ఈశ్వరుడు సర్వశక్తిమంతుడు. అతడు సర్వకార్యములు కరచరణా ద్యవయవములు లేకయే చేయగలడు. మానవసాహాయ్యముగాని మఱియే యితర సాహాయ్యముగాని యపేక్షింపడు. సమస్తకార్యములు స్వయముగా జేయగలడు.

ఈశ్వరుడు అజన్ముడు, నిర్వికారుడు. అతడు మానవులవలె జన్మ

మరణ రూపఘటనాచక్రములో బడడు. అవతారముల నెత్తడు. రామకృ ష్ణాదు లీశ్వరావతారములుగావు. అతని కొక డెవడో పవిత్రపుత్రుడు కాజాలడు. రామకృష్ణాదులు తాము జన్మించిన కాలములో (యుగము లలో) ధర్మాచరణశీలురైన మహాపురుషులు. కాబట్టి వారివారి గొప్పగొప్ప కార్యములను, గొప్పగొప్ప గుణములను స్మరించుచు వారి జీవితముల ననుసరింపదగును. కాని వారి విగ్రహముల నీశ్వర భావముతో పూజిం పదగదు.

(గ) జగదుత్పత్తి స్థితి లయములను గావించుట, సృష్టి నిర్మాణము గావించి దానిని క్రమపద్ధతిని నడుపుట, ప్రాణుల కన్నింటికి వానివాని శుభాశుభ కర్మానుసారము షక్షపాత రహిత బుద్ధితో ఫలమును గలు గజేయుటయు నతని కార్యములు. ఇందువలననే అతడు దయాళువు, న్యాయకారి యందురు.

(ఘ) ఆయనను వివిధ దేశములలోను భిన్నభిన్న కాలములలో భిన్నభిన్న నామములతో పేర్కొనిరి. ప్రపంచేతిహాసమున భగవంతుని సర్వప్రథమనామము 'ఓంకారము'.

2. (క) జడచేతన పదార్థముల సమ్మేళన పరిణామమే సృష్టి. దృశ్యమాన ప్రపంచమునకు భౌతిక కారణము ప్రకృతి. దానిని ఉపా దాన కారణ మందురు. సూక్ష్మపరమాణువుల సమూహము ప్రకృతి. ఇవి జడములు, జ్ఞానరహితములు, అనాద్యనంతములు, వీనికి ఉత్పత్తి వినాశములు లేవు. పృథివ్యాపస్తేజో వాయ్వాదులన్నియు వీని సంయోగ జన్యములు. మన శరీరములుగూడ నీ ప్రాకృతిక పరమాణువులచేతనే యేర్పడినవి.

ప్రకృతి, సత్వరజస్తమో గుణరూప త్రిగుణాత్మకము. (దీనిస్వరూప మదృశ్యము) పృథివ్యాపస్తేజో వాయు రాకాశపంచకముద్వారా యిది ప్రకటితమై దృశ్యమాన మగుచున్నది. 'ఓంకార' వాచ్యచేతనశక్తి దీనికి కర్త. ఆశక్తియే యీపరమాణువులను మిశ్రమొనర్చి 'సృష్టి స్థితిలయ' రూప జగత్తును నిర్మించి దానిని నియమబద్ధముగ నడుపుచుండును.

(ఖ) రేయింబవళ్లువోలె నీ 'యుత్పత్తి ప్రళయచక్రము'న కాద్యంత

ములు లేవు. కాని సూర్యోదయము మొదలుకొని సూర్యాస్తమయ పర్యంతముండు పగటివలె నీ వర్తమాన సృష్టి కాద్యంతములు గలవు. ఇదియేర్పడి 1972949057 వర్షములైనది.

(గ) పరమాణువుల సంయోగమువలన సృష్టి యేర్పడుచున్నది. వాని వియోగమువలన ప్రళయము గలుగుచున్నది.

సృష్టి:- కారణద్రవ్యము (ప్రకృతి), కర్త (ఈశ్వరుని) ద్వారా పలు రకముల కార్యరూపములను బొంది సృష్టియని వ్యవహరింపబడును.

ప్రళయము:- కర్త (ఈశ్వరుడు) కార్యరూపసృష్టిని తిరిగి కారణ రూపములోనికి మార్చినపుడు ప్రళయమనబడును. కార్యరూప జగత్తు మరల కారణరూపము నొందుట ప్రళయమని భావము.

3. (క) ఈశ్వరునికంటె భిన్నమగు మఱియొక చేతన శక్తి కలదు. అది జీవుడనబడును. అది సృష్టినిర్మాణ మొనరింపజాలదు. వానిభోగ మున కనుకూలముగా నీసృష్టి ఈశ్వరునిచే నిర్మింపబడును.

(ఖ) జీవుడణుస్వరూపుడు. సంఖ్యలో ననేకము. అజుడు నిత్యుడు, శాశ్వతుడు, అల్పశక్తిమంతుడు, అల్పజ్ఞుడు, కర్మఫలభోక్త, ఇచ్ఛాజ్ఞానప్ర యత్నము లతనికి లింగములు. జీవునిచే చేయబడు కర్మల కనుకూ లముగ నతనికి దేహములు లభించును. పుణ్యకర్మకు పుణ్యయోని, పాపకర్మకు పాపయోని ఇట్లు క్రిమికీటపతంగాది శరీరములను ధరించి జగమున ప్రయత్నపరుడగును.

(గ) మానవయోనిని పొంది జీవుడు పురుషార్థముద్వారా తనక నుకూలముగనో లేక ప్రతికూలముగనో పరిస్థితుల నేర్పఱచుకొనును, అతడు స్వతంత్రేచ్ఛువు, కర్మనొనరించుటలో స్వతంత్రుడు, ఫలము నను భవించుటలో పరతంత్రుడు.

(ఘ) జీవునకు శరీరముతో కలుగు సంబంధమునకు జన్మ యనియు, వియోగమునకు మృత్యువనియు నామములు. జీవుడు స్వయముగా మర ణింపడు, జన్మింపడు, అతడు నిత్యమైన సత్పదార్థము. అతనిలో నున్న శక్తి, జ్ఞానము, స్వల్పములు. అందువలన నతడల్పజ్ఞుడు, అల్ప

శక్తి మంతుడు ననబడుచున్నాడు.

(ఙ) జీవుడు జన్మతో పాపిగాని, పుణ్యాత్ముడుగానికాడు.

(చ) జీవుడు తాజేయు కర్మల ననుసరించి యనేక దేహముల ధరించుచుండును. ఇట్లు ఒకదేహమును విడిచి మఱియొక దేహమును బొందుటయే పునర్జన్మ యనబడును. ఈ జన్మజన్మాంతరములకు కారణము జీవుడొనరించు కర్మలే. కాగా, లోకమున మనచే జూడబడు వైషమ్యము (నానా భేదములు)నకు ఈశ్వరుని స్వేచ్ఛ కారణము కాదని స్పష్టముగా తెలియనగును. జీవుడు తాజేయు ప్రతికర్మకు తగిన ఫలమును సుఖదుఃఖ రూపమున ననుభవింపక తప్పదు. ఈశ్వరుడు పాపములను క్షమింపడు. జీవునిలో స్త్రీ పురుషభేదములు లేవు. లింగ భేదము దేహమునకు సంబంధించినది.

(ఛ) ఈ ప్రపంచమునకు మూలకారణములు మూడు. ప్రకృతి, జీవులు, పరమేశ్వరుడు. ఇందు పరమేశ్వరుడు సృష్టి కర్త. జీవులు భోక్తలు. ప్రకృతి భోగ్యపదార్థము. ఇది జడము. ఈ మూడును నిత్యములు. స్వతంత్ర సత్తాగలవి. ప్రకృతిసత్స్వ రూపము. జీవుడు సచ్చిత్స్వరూపుడు. పరమేశ్వరుడు సచ్చిదానంద స్వరూపుడు.

4. ఈ దృశ్యమానప్రపంచము (మిథ్య) కల్పితము కాదు. ఇది యొకని లీలావిలాసమాత్రము కాదు. "కున్" (అగుము) అని యాదేశించిన మాత్రమున నేర్పడినదియు కాదు. కాగా నిదిసత్యము.

5. ఆర్యసమాజము, ఋగ్యజుస్సామాథర్వములను నాలుగువేదములు (మంత్రసంహితములు) స్వతః ప్రమాణములని యంగీకరించును. ఈ వేదోపదిష్టసిద్ధాంతములు సార్వదేశికములు, సార్వకాలికములును. ఇవి యొకానొకదేశమునకో కాలమునకో సంబంధించినవి కావు. మనుష్యుల సర్వతోముఖవికాసమునకు తగిన వైజ్ఞానిక విధులిందుజెప్పబడినవి. ప్రపంచమునగల విద్యలన్నియు వేదమూలకములు. అన్ని ధర్మములు వీనినుండియే యుద్భవించినవి. వైదికసిద్ధాంతములు బుద్ధికి, విజ్ఞానమునకు విరుద్ధములు కానేరవు.

(క) భారతదేశములో వేదేతరసాహిత్యము ఆర్ష, అనార్ష భేదములతో రెండు విధములుగా వ్యవహరింపబడును. ఇందార్ష గ్రంథములు వేదానుకూలముగా ప్రమాణములగుచు పరతః ప్రమాణములు.

(ఖ) విశ్వములోని యితర సాహిత్యము నాదరదృష్టితో చూచుటయేగాక, విజ్ఞానమునకు బుద్ధికి విరుద్ధము కాని ప్రతి యథార్థవిషయమును వేదానుకూలముగా నంగీకరించును.

(గ) వేదభాష సంస్కృతముకంటె విలక్షణమైయుండును. ఇది ప్రపంచమునగల భాషలకు జనని యన నొప్పును.

(ఘ) వేదములు చరిత్రలు కావు. ఇందొకానొకజాతికిగాని, వంశమునకుగాని, దేశమునకుగాని సంబంధించిన ఇతివృత్తము లేదు. కాని సర్గలకు సంబంధించిన చరిత్ర కాననగును. రామకృష్ణాద్యవతారముల గాథలును కానరావు. ఇందనేక శబ్దములు స్థలవిశేషమునకో వ్యక్తి విశేషమునకో చెందిననామములుగా తోచును. కాని వానియర్థములు భిన్నములు, ఇందుబహూదేవవాదమును లేదు. ఇంద్రాగ్న్యాది నామములు పరమేశ్వరునే బోధించును. అయాప్రకరణముల భౌతిక పదార్థములకును నీశబ్దములు బోధకములు కావచ్చు. వేదములను చదువుట కెల్లరికి నధికారమున్నది.

6. ప్రప్రథమమున మానవసృష్టి త్రివిష్టపము (హిమాలయము)న జరిగినది. అటనుండియే మానవులు సమస్త భూమండలమున వ్యాపించిరి. వీరు ఆర్యులనబడిరి. క్రమముగా నాయాదేశములలో భిన్ననామములచే వేర్కొనబడిరి. సర్గారంభమున నాదిదంపతులను పేర ఒక పురుషుడు నొక స్త్రీయుగాక, అనేకులు స్త్రీపురుషులు తరుణదశలో నేర్పడిరి. వారి సంతతి క్రమముగా వివాహాది సంబంధముల నేర్పఱచుకొని నేటి మానవ సంఘమును నిర్మింప గలిగినది.

7. ఆర్యసమాజము సర్వభూతదయాసిద్ధాంతము ననుసరించి యెల్ల ప్రాణులతోను ప్రీతిపూర్వకముగా, న్యాయము ధర్మము తప్పని విధమున వ్యవహరించును.

మానవసంఘమున భ్రాతృభావమును, సర్వస్వాతంత్ర్యమును, నెల్ల

రికిని సమానాధికారము నంగీకరించును.

నైసర్గిక భేదభావమును విడిచి మిగిలిన అన్ని వ్యవహారములందును స్త్రీ పురుషులకు సమానాధికారము నొప్పుకొనును. సాంఘికదృష్టితో నాగరికాధికారములందు నెట్టి భేదభావమును పాటింపదు.

8. మానవులలో సర్వాంగీణ వికాసము కోరుచు, వైయక్తిక సామాజిక ఉన్నతి నొందుటకు తగుమార్గముల వెదకును. వైయక్తిక సర్వతోముఖ వికాసము నుద్దేశించి మానసిక శారీరిక వృద్ధిని కలుగజేయు ఆసన ప్రాణాయామాది యోగపద్ధతులను జనులలో ప్రచారమొనరించును. మద్యమాంస ధూమ పానాది దుర్వ్యసనములను పోనాడ యత్నించును. బ్రహ్మచర్యపాలనకై ప్రజల నుద్బోధించును. పంచమహా యజ్ఞములు వ్యక్తికి దినచర్యగా బోధించును.

1) బ్రహ్మయజ్ఞము :- ఆత్మచింతన, స్వాధ్యాయముల ద్వారా అంతఃకరణమును శుద్ధ మొనర్చుట.

2) దైవయజ్ఞము :- అగ్ని హోత్రముద్వారా వాయువును పవిత్ర మొనర్చి గృహారోగ్యమును కాపాడుకొనుట.

3) పితృయజ్ఞము :- జీవితవృద్ధమాతా పితరులకు సేవల నొనర్చుట.

4) అతిథియజ్ఞము :- అతిథుల నాదరించుట. కార్యవశమున గృహమున కరుదెంచు బ్రహ్మచర్యవానప్రస్థసంన్యాసాశ్రమవాసులను పోషించుట.

5) బలివైశ్వదేవము :- ఆశ్రితప్రాణుల (గృహజంతువులు, ఓిదజనులు) కు తగిన పోషణ నిచ్చుట.

ఇంతియగాక, జన్మమొదలు మరణపర్యంతము గర్భాధానాదిషోడశ సంస్కారముల నొనర్చుట జీవన - కార్యక్రమమని యీ సమాజమెంచును.

సంఘసౌష్ఠవము నభిలషించుచు వేదప్రతిపాదిత వర్ణాశ్రమవ్యవస్థను ఈ సమాజము పోషించును. ఇందు వర్ణవ్యవస్థ, గుణకర్మల ననుసరించి యుండుననును. సంఘముననుండు వ్యక్తులెల్లరు పరహితమును ధ్యానమందుంచుకొని స్వహితమునకై యత్నింపవలయును. ప్రస్తుతమున సంఘమున

గల వ్యావహారిక జన్మమూలక కులభేదములను సమూల మున్మూలించి సామ్యతను స్థాపింప నెన్నివిధముల యత్నించును. మానవ సంఘములో దేశ జాతిమూలకమైనట్టియు వర్ణమూలకమైనట్టియు గొప్పతనము నంగీకరింపదు.

మానవజీవిత పరిమాణము సాధారణముగా నూఱువత్సరములు. జీవితసమయమున ప్రారబ్ధకర్మఫలముల ననుభవించుచు రాబోవు జన్మకు తగినట్లు తన్ను సంస్కరించుకొనుట జీవనధ్యేయము. ఇందుకనుకూలముగా జీవితకాలమును నాలుగాశ్రమములుగా విభజించి, ప్రథమాశ్రమమున బ్రహ్మచర్యమును పాటించుచు విద్యాబుద్ధులగఱచుట యావశ్యకమగును. ఇట్లు ప్రథమవయస్సు (ఇరువదియైదు వత్సరములు) గడపి, యటుపై యేబదియేండ్లవఱకు గృహస్థధర్మముల పాలింపవలయును. ఈ యాశ్రమ మితరాశ్రమవాసుల కాశ్రయముగా నుండును. అటుపై గృహమును విడిచి వనమున వాసమేర్పఱచుకొని తాగడించిన యనుభవముద్వారా తనచెంత జేరు బాలకులకు విద్యాభ్యాసమొనర్పజేయుచు నింద్రియముల స్వాధీనమున నుంచుకొని తపోమయజీవితము ననునయించును. ఇది వానప్రస్థాశ్రమము. చివరిదశలో సర్వథా విరక్తుడై మమత్వమునువీడి బ్రహ్మనిష్ఠుడై శరీరమును త్యజించును. ఇదియ సంన్యాసాశ్రమము.

(9) భూతలమున వసించు మానవసంఘములో నాయాదేశకాలానుకూలముగ నేర్పడిన ధర్మన్యాయానుమోదిత నియమములను పాటించు నాగరికులను ఆర్యులనియు, సామాజిక వ్యవస్థను భంగ మొనర్చి మానవసంఘక్షయమునకు యత్నించువారిని దస్యులనియు నీసమాజము వ్యవహరించును.

వర్ణవ్యవస్థ :- విద్యాశిక్షణద్వారా సమాజాభ్యుదయము నభిలషించి యత్నించువారు బ్రాహ్మణులనియు, ప్రజలలో శాంతిని స్థాపించుచు, పీడితవర్గమును కష్టపరంపరల నుండి రక్షించువారు క్షత్రియులనియు, దేశమునగల వ్యక్తులకందఱికి అన్నవస్త్ర నివాసాదులను కల్పించుట కనువగు వ్యాపార వ్యవసాయాదుల నొనర్చుచు పదార్థముల సేకరణ విభజన వ్యవస్థల జేయువారు వైశ్యులనియు, శారీరిక పరిశ్రమలద్వారా సంఘమున కుపకరించువారు శూద్రులనియు నీసమాజము వ్యవహరించును.

బ్రాహ్మణులు శాసనవిధానమును నిర్మింతురు. క్షత్రియులు దానిన నుసరించి శాసింతురు. వైశ్యులు పదార్థసేకరణ కొఱకు నన్నివిధములగు వ్యాపారములనొనరింతురు. శూద్రులు సమాజనిర్మాణమున శారీరికముగా నన్నివిధములతోడ్పడుదురు.

సమాజమున, సాంఘిక నాగరికాధికారముల విషయమున వీరిలో నెట్టి హెచ్చుతగ్గులను పాటింపదు. ఆహారవిహార విద్యానివాసాది వ్యవస్థ లలో నెల్లరు సమాన హక్కులు కలిగి యుందురు. జన్మతో మనుజులెల్లరు సమానులే. గుణకర్మ భేదముల ననుసరించి పైన వర్ణించినట్లు బ్రాహ్మ ణాది శబ్దములచే వ్యవహరింపబడుదురు. ఈ శబ్దములు వర్ణవాచకములు, జాతివాచకములు కావు. వర్ణము మాఱవచ్చు. ఒకరు శూద్రులనబడుచు న్నంతమాత్రమున వారు నీచులుకారు. వారు చేయు పనిలో నికృష్టత లేదు. వృత్తిని బట్టి వారి నేవగింపరాదు.

(10) అవిద్యను నశింజేసి విద్యను వ్యాపింపజేయుటలో నీసమాజ మెట్టిభేదమునుపాటింపక యెల్లపుడుసిద్ధముగా నుండును. బాలబాలికల సహశిక్షణ మానవసమాజమునకు హితకరముకాదని యెంచును. శిక్షా విధానమున గురుకుల శిక్షా పద్ధతి శ్రేష్ఠమని యెంచును. విద్యాసంస్థ పట్టణ వాతావరణమునకు దూరముననుండుట మంచిదనును. శిక్షణో ద్దేశము జీవికకు గాక ఉత్తమనాగరికతా సంపాదనముగా నెంచును.

ప్రపంచమునగల భాషలకు మూలభాషయైన సంస్కృత (వైదిక) భాషను నెల్లరు నేర్వవలయునని ప్రేరించును.

మనుష్య జీవనోద్దేశము యథార్థజ్ఞానమును సంపాదించుచు వ్యక్తి త్వమును వికసింపజేయుట యనును. ప్రతిమనుష్యుడు శారీరికముగాను, మానసికముగాను వృద్ధిపొందవలయునని కోరును. జీవనము సత్యము శివము సుందరము గావలయునని యెంచును. కళలను పోషించును.

(11) ప్రతిదేశమునందును మాతృభాష రాజభాషగా నుండవలయు నను సర్వసమ్మత సిద్ధాంతము నంగీకరించును. భారతదేశమునకు హిందీ రాష్ట్రభాషగా నెంచును. ప్రతి యార్యుడు నీ భాషను నేర్వవలయునని ప్రేరించును.

ప్రతిదేశమునందును శిక్షణసంస్థలలో నాదేశపు ప్రజాభాషద్వారా విద్యలను నేర్పవలయును.

మతముతోగాని, సంప్రదాయముతోగాని రాజభాష కెట్టి సంబంధము నుండదు. చైనాదేశముననుండు హిందువులకు రాజభాష చీనీభాషయే యగును. కాగా, భారతముననుండు జైన, బౌద్ధ, క్రైస్తవ మహమ్మదీయ సోదరులకును రాజభాష హిందీయనియు, లిపి దేవనాగరి యనియు నీసమాజమంగీకరించును.

(12) వివాహము :- సంతానశృంఖలను స్థిరముగా నుంచుటకు యుక్త వయస్సు వచ్చినతరువాత సమానగుణశీల సంపన్నవ్యక్తులు ఒకమాటు వివాహమును జేసికొనుట కీసమాజమంగీకరించును. వివాహవిషయమున జన్మ మూలకకులభేదములను పాటింపదు. దంపతులలో నొకరు మరణించిన నితరులు బ్రహ్మచర్యముతో శేషజీవనమును నడుపుట శ్రేయస్కరము. అది యసాధ్యమగుచో విధవావిధురులు సంఘానుమతి పూర్వకముగా సంతానార్థము పునస్సంధానము చేయదగుదురు.

(13) ప్రతిదేశమునకు సంబంధించిన సర్వవిధములయిన రాజనైతిక, సామాజిక, సాంస్కృతిక, ఆర్థిక విషయములలో శాసనాధికారము ప్రజలకే యుండవలయునని యీ సమాజ ముద్దేశించును.

ఒకానొకజాతి, దేశము, వర్గము, మఱియొకజాతి దేశ వర్గములపై వానియిచ్ఛలకు విరుద్ధముగా ప్రభుత్వమొనర్చుట కెన్నడు నంగీకరింపదు. పూంజీవాదమునకు సామ్రాజ్యవాదమునకు నీసమాజము ప్రబలశత్రువు.

మంచిచెడుగులను వివేకింపగలిగి తరుణవయస్కులయిన స్త్రీపురుషుల కెల్లరకు సమ్మతిని తెలుపు (ఓటింగ్) అధికార ముండవలయునని యొప్పుకొనును.

ప్రపంచమునగల మానవసంఘమున కంతటికి సంబంధించిన, మానసిక, శారీరిక, ఆత్మిక, సామాజిక, రాష్ట్రీయ అభ్యుదయమునకై యత్నించుట ఈ సమాజము యొక్క ముఖ్యోద్దేశము.

(14) సర్వలోక కల్యాణమునకై సామాన్యజనులనుండి జాతి మత కులభేదములను పాటింపకయే యెన్నుకొనబడిన యోగ్యులు, త్యాగులు,

సమర్థులనయిన ప్రతినిధులద్వారా శాసింపబడు ప్రజాతంత్రాత్మక వ్యవస్థ సర్వోత్తమమనియెంచును.

ఏ దేశమునను మతభేదమును పాటించుచు నొకవర్గమునకు ప్రత్యేకాధికారములను కల్పించుటకుగాని, ప్రత్యేకముగా నెన్నికలను జరుపుటకుగాని, దేశములో నొకింతభాగమును పంచిపెట్టుటకుగాని యీ సమాజమంగీకరింపదు.

(15) స్వదేశపరికరముల నుత్పన్నమొనర్చి వాడుటకు స్వసంస్కృతి నభివృద్ధిపఱచుటకు, స్వదేశ వ్యాపారమును పెంపొందించుటకు నన్నివిధముల నీసమాజముయత్నించును.

(16) స్టేషన్, భోజనాలయము, విహారస్థలము, పుస్తకాలయము, ప్రార్థనాలయము, మున్నగుస్థలములను సార్వజనికములుగా నంగీకరించుచు నందఱికి సమానప్రవేశ సమాన వ్యవహార ముండవలెనని బోధించును.

(17) విశ్వశాంతి కొఱకు ప్రతిరాష్ట్రమునకు రాజనైతిక, సాంస్కృతిక విషయములలో ఆత్మనిర్ణయాధికార ముండవలయును.

అంతర్జాతీయవాదమును సమర్థించును. కాబట్టి భూతలమున చక్రవర్తి సామ్రాజ్యమును స్థాపింప నంగీకరించును. అట్టి సామ్రాజ్యములో సర్వరాష్ట్రముల నుండి యెన్నుకొనబడిన నిస్స్వార్థప్రతినిధులచే నిర్మింపబడిన వ్యవస్థ శాసనమొనర్చును.

(18) ప్రతిమనుజుడు దీనుడుకాక నూఱువర్షములు దీర్ఘజీవనమునందుటయేగాక జీవితపర్యంతము కర్తవ్యకర్మల నొనర్చుచుండుటకై యీసమాజము ప్రబోధించును. ఎల్లరకు శారీరిక పరిశ్రమ మొనర్చుట యనివార్యమగును. పరిశ్రమ జేయకయే యుపభోగము నభిలషించుట సాంఘికాపరాధముగా నెంచును.

యోగ్యత ననుసరించి వ్యక్తులకు సమాజమున స్థానము నంగీకరించును. ఆవశ్యకత ననుసరించి యెల్లరకు తగిన భోజనాచ్ఛాదన నివాసశిక్షణాదుల నొసంగవలయునను.

(19) మహా పురుషులనెల్లరిని యీ సమాజము గౌరవ దృష్టితో

జూచును. ప్రతిమతమును సహనబుద్ధితో జూచును. శ్రీమద్దయానంద మహర్షి ప్రాచీన వైదికధర్మ పునరుద్ధారకుడనియు, సంఘసంస్కర్తయనియు, ప్రపంచేతిహాసమున నవయుగ నిర్మాత యనియు, సర్వతోముఖ భారతాభ్యుదయమునకు ప్రథమ మార్గదర్శకుడనియు నంగీకరించును.

(20) జీవుడు శుభకర్మలను కర్తవ్యకర్మలుగా జేయుచు నంతఃకరణమును పవిత్ర మొనర్చుకొని జన్మజరాదుల బంధన దుఃఖములనుండి విముక్తుడగును.

మహాప్రళయానంతరము ముక్తజీవులును సర్గారంభమున పునఃశరీరధారులగుదురని ఈ సమాజ మంగీకరించును. ముక్త జీవులకు అయోనిజ శరీరము లభించును. వారా శరీరములతో శుభకర్మలను కర్తవ్యములుగా జేయుదురేని ముక్తులగుదురు. ఫలాసక్తి బుద్ధితో కర్మాచరణపరులై జన్మ పరంపర ననుసరింతురు.

సర్వవిధములగు దుఃఖములనుండి పూర్ణముగా విడివడుట ముక్తియనబడును. దుఃఖములచే పీడితుడగుట బంధన మనబడును.

బంధనములనుండి విడివడి ముక్తుడగుటకు ఒకానొక వ్యక్తియందో లేక గ్రంథమునందో విశ్వాసముంచుట యనావశ్యకము. సదాచార, సత్యభాషణ, యోగాంగానుష్ఠానాదులే ఇందుకు సాధనములని ఈ సమాజమెంచును. కాని,

(21) ఆర్యసమాజమున నియమబద్ధ సదస్యుడగుటకు దయానంద మహర్షి ద్వారా ప్రతిపాదిత వైదికసిద్ధాంతముల నంగీకరింపవలయును.

ఈ సమాజమున సదస్యుడు కాకున్నను సమాజసిద్ధాంతముల నంగీకరించి యాచరించు వ్యక్తి వైదిక ధర్మియనియు, ఆర్యుడనియు వ్యవహరింపబడును.

## అంతిమ నివేదనము

ఆర్యసమాజ సందేశ మేమను ప్రశ్నకు సంక్షేపముగా సమాధానముజెప్పిన, ప్రపంచమునగల సమస్తధర్మములదృష్టిపథము మార్చుటయే యనవచ్చును. ధర్మము విజ్ఞానము ననునీరెండును పరస్పరవిరోధ విషయము లనుట మూర్ఖతయని దయానందమహర్షి చాటించెను. ధర్మ

శాస్త్రములలో

"యస్తర్కేణానుసంధత్తే స ధర్మః వేద నేతరః"

యుక్తులతో విచారించిన నిలబడునదియే ధర్మమని వర్ణింపబడియున్నది. ఆర్యసమాజము హిందువులనుండి దూరముగా నుండు సంఘము కాదు. హిందువులచే నాదరింపబడు వేదములు ఉపనిషత్తులు బ్రాహ్మణ - గ్రంథములు సమాజమునకు మాన్యములే. ప్రాచీన వర్ణాశ్రమవ్యవస్థయే ఆర్యసమాజమునకును గ్రాహ్యమైయున్నది. కాని దీనిలో గల ప్రాచీన సుందర ఆదర్శముల స్థానమున హిందువులచే గ్రహింపబడిన బుద్ధివిరుద్ధమ యిన అవైదికాచారములను ఆర్యసమాజము ఘృణితదృష్టితో చూచుటయే గాక వానిని హిందూ సమాజము నుండి దూరమొనర్చి, దానిస్వ రూపమును పరిమార్జిత మొనర్ప నిరంతరము యత్నించుచున్నది. భారతవర్షమున మరల ప్రాచీన వైదిక సభ్యత వ్యాపింపవలయుననియు, ఆర్యజాతి తన ధార్మిక సామాజిక సంఘటనములను సరిచేసికొని ప్రపంచమును నడుపుజాతులలో తననామము నంకితమొనర్పవలయుననియు నార్యసమాజము కోరుచున్నది.

ఆంధ్రపాఠకులారా ! ఆర్యసమాజ సిద్ధాంతములు స్వదేశమునకును, మనుష్యజాతికి నెంత యుపకారకములో పరికింపుడు. దేశభక్తులెవ్వ రును ఆర్యసమాజ ప్రచారావశ్యకతను తిరస్కరింపజాలరు. మీలో నెవరికైనను ఆర్యసమాజ కార్యములలో నొకదానియందైన సానుభూతి యున్నచో ఆర్యసమాజమున ప్రవేశించి మానవజాతికిని దేశమునకును సేవచేయుడు. ప్రతి మనుష్యుడు తన స్వభావానుకూలమగు కార్యము నిందు గ్రహించి తన సేవను ప్రదర్శింప వీలున్నది. ఆర్యసమాజమొక విశాల కార్యప్రణాళికను గలిగియున్నదని యీ పుస్తకము జూచినవారికి వేఱేచెప్పనేల ! మాంసభక్షణను జీవహింసను మీరేవగింతురేని యార్యస మాజముతో తమ చేతులను గలిపి దేశమునుండి యీ దురాచారమును దూరమొనర్పుడు. మద్యపాన మహితకరమని యెంతురేని రండు, దానిని తొలగింపనడుములు కట్టుదము. నాస్తికవాదము యొక్క చెడుగులు మీమనస్సులకుదోచినచో నార్యసమాజ మందుల కత్యంతోపయోగియును కార్యకారియునగు సంఘము. అస్పృశ్యుల నుద్ధరించుటను మీరు ప్రేమిం

తురేని ప్రపంచమున నార్యసమాజమున నున్నంత యవకాశము మఱి యేసమాజమునందును లేదని మీరు నిశ్చయముగా నమ్ముడు. ఆధ్యాత్మికోన్నతి నభిలషింతురేని యార్యసమాజ మందుల కుపయోగించు నుత్తమోత్తమ సాధనములను మీకు చేకూర్చును. దయానంద మహర్షి తపోబలము, ఆత్మత్యాగము, ధర్మమునందును, జాతి యందును, మహర్షికిగల గాఢానురాగము, ఆత్మసమర్పణమును దేశహితైక ప్రాణులగు మిమ్ముల నీపవిత్ర యజ్ఞమున శక్తికొలది పాల్గొన నాహ్వానించుచున్నవి. దయానంద మహర్షి శబ్దములతో నీ గ్రంథమును పూర్తిజేయుచున్నారము.

"ప్రాచీన సమయమున భూమండలమునం దంతట వేదోక్త ధర్మమే వ్యాపించి యుండెను. దానియందే యందఱికి పూర్ణనిష్ఠ యుండెడిది. నాడు ఒండొరుల సుఖ దుఃఖములను హానిలాభములను సమానముగా నెంచుచుండెడివారు. నేడనేక మతములు వ్యాపించుటచే ననేక విధ దుఃఖములు విరోధములు నెక్కువయినవి. వీనిని నివారించుట బుద్ధిమంతుల కర్తవ్యమై యున్నది. ఈశ్వరుడు మిథ్యామతములను దూరమొనర్చి సత్యబుద్ధిని జనుల కందఱికి ప్రసాదించుగాత. విద్వాంసులందఱును విరోధభావమును విడిచి సద్విచారములతో నానందము ననుభవింతురు గాక".

ఇతి

ఆర్యసమాజ పరిచయము

## ఆర్యసత్సంగ నియమములు

ఆర్యసమాజికు లెల్లరు సప్తాహమున కొకమాఱు తీరిక చేసికొని ఒకచోజేరి సమిష్టిని సత్సంగ మొనరింపవలయును. అట్టితఱి వైదిక ప్రార్థనా మందిరమునకు అరుగుదెంచిన ఆర్యులెల్లరు స్త్రీపురుష భేదము పాటింపక, వినీత సౌహృదయభావముతో "నమస్తే" అను వైదికశబ్ద పూర్వకముగ పరస్పరము నమస్కరించుకొనవలయును. ఇది మనకు పరంపరానుగతవైదికాచారము. ఇందు పిన్నలు పెద్దలకు ప్రణమిల్లుటయు, పెద్దలు పిన్నలను దీవించుటయు, ఒక సాంప్రదాయమగు మర్యాదగా నడుచుచున్నది.

పిదప నటకు జేరిన ఆర్యులెల్లరు విశ్రాంతిగ నాసీనులై యన్యచింతన

ముల విడనాడి 'సంధ్య' నొనరింపవలయును. అనంతరము ఈశ్వరస్తుతి ప్రార్థనోపాసనా మంత్రములు పఠించి స్వస్తివాచనము, శాంతిప్రకరణ మంత్రములను ఉచ్చైఃస్వరముతో శ్రావ్యముగ పఠింపవలయును. పిదప ముమ్మారాచమించి 'అగ్ని హోత్రమును' పూర్తియొనరించి 'భగవత్ సంకీర్తన' నొనరించి యాపైన పండితుడు, జ్ఞాని, అనుభవజ్ఞుడునగు వాని ఉపదేశమునో సద్గ్రంథపఠనమునో జరిపింపవలయును. తక్కినవారెల్లరు ఉపదేశమును కడుశ్రద్ధాభక్తులతో వినవలయును. దీనికి తరువాత సమాజమునకు సంబంధించిన యేవేని విషయములున్న సూచింపవలయును. పిదప ఋగ్వేదములోని ఈ క్రింది వ్రాయబడిన మంత్రములను సమష్టిగ ఉచ్చరింపవలయును.

ఓంసమిద్యవసే వృషన్నగ్నే విశ్వాన్యర్య,
ఆ ఇళస్పదే సమిధ్యసే స నో వసూన్యాభర॥

అర్థ :- వర!=బలశాలి! ఆర్య!=శ్రేష్ఠుడా! అగ్నే=పరమాత్మా! విశ్వాని=సర్వపదార్థములను, ఇత్=నిశ్చయముగ, సం, ఆ, యవసే=ఏకత్రిత మొనరించు చున్నావు. ఇళః పదే=భూమి- వాణీస్థానములందు, సం ఇధ్యసే=ప్రకాశితుడవగు చున్నావు సః=ఆ నీవు నః=మాకు, వసూని=ధనములను, ఆభర=కలిగింపుము.

ఓంసం గచ్ఛధ్వం సం వదధ్వం,
సం వో మనాంసి జానతాం,
దేవా భాగం యథాపూర్వే,
సంజానానా ఉపాసతే॥

అర్థ :- సజ్జనులారా! మీరందఱును, సంగచ్ఛధ్వమ్=ఐకమత్యముతో నభివృద్ధిగాంచుడు! సంవదధ్వమ్=పరస్పరము పరుషవాక్యముల విడనాడి మధురముగ మాట్లాడుకొనుడు! వః=మీ యొక్క, మనాంసి=మనములు, జానతామ్=ఉత్తమోత్తమ సంస్కారములు కలవి యగును గాక! పూర్వే=ప్రాచీనులు, సంజానానాః=ఉత్తమజ్ఞానులు, దేవాః=వ్యవహార చరితులు నగు జనులు, యథా=ఎట్లు, భాగమ్=కర్తవ్యమును, ఉపాసతే=చేయుచున్నారో, అట్లే మీరును కర్తవ్యముల విడువక నిర్వర్తింపుడు.

ఓంసమానో మంత్రః సమితిః సమానీ,
సమానం మనః సహ చిత్త మేషామ్,
సమానం మంత్ర మభి మంత్రయే వః,
సమానేన వో హవిషా జుహోమి॥ ఋ॥10॥191॥1,2,3॥

అర్థ :- ఆర్యజనులారా! మంత్రః=మీయందఱియాలోచనయు, సమానః=భేదభావములేక ఏకమగునుగాక!= సమితిః=మీసభ, సమానీ=ఛిన్న భిన్నములుగ నుండక ఏకముగనుండును గాక! మనః=మీమనస్సు, సమానమ్=భేదాభిప్రాయము లేని దగునుగాక! ఏషామ్, చిత్తమ్, సహ=(భిన్నాభిప్రాయము గల) వీరి చిత్తము కూడ పలువురితో నేకీభవించునుగాక! వః=మీ యొక్క, మంత్రః=అభిప్రాయము, సమానః=భిన్నభావములు లేక ఏకమైన దానినిగా, అభిమంత్రయే=ఒనరింతును వః=మీకు, సమానేన=హెచ్చుతగ్గులులేక సమానమగు, హవిషా=అన్నము ఆదిగాగల పదార్థములను, జుహోమి=ఇచ్చుచున్నాను.

ఓంసమానీ వ అకూతిః సమానా హృదయాని వః,
సమానమస్తు వో మనో యథా వః సుసహా సతి॥ ఋ॥10॥194॥4॥

అర్థ :- సత్పురుషులారా! యథా=ఎట్లు, సహ, సు, అసతి=సమానమగునో యట్లు, వః=మీ యొక్క, అకూతిః=ధ్యేయము, (ఆధ్యాత్మికాదర్శము) ఒకటేయగును గాక! వః=మీయొక్క, హృదయాని=హృదయములన్నియు ఏకమగును గాక! వః=మీ యొక్క, మనః=మనస్సు, సమానమ్=సమానమైనది, అస్తు=అగునుగాక!

పిమ్మట "జయజగదీశహరే" అను మంగళగాన మొనరించి ప్రశాంతహృదయముతో "శాంతి పాఠము"ను పఠించి సత్సంగమును నాటికి విరమింపవలయును.

ఇతి

ఆ ర్య స త్సం గ ని య మ ము లు

* * * * *

# హవన సామగ్రి

| | |
|---|---|
| తెల్లగంధము పొడి | నాలుగు తులములు |
| అగరు | రెండున్నర తులము |
| గుగ్గిలము | ఏడున్నర తులము |
| తగరు | రెండున్నర తులము |
| జాజికాయ | రెండున్నర తులము |
| జాపత్రి | రెండున్నర తులము |
| దాచినచెక్క | రెండున్నర తులము |
| తాళసపత్రి | రెండున్నర తులము |
| లవంగములు | రెండున్నర తులము |
| పెద్దయేలకులు | రెండున్నర తులము |
| ఎండుకొబ్బరి | రెండున్నర తులము |
| ఖర్జూరకాయలు | ఐదు తులములు |
| తుంగకాయలు | రెండున్నర తులము |
| ఎఱ్ఱగులాబి | ఐదు తులములు |
| యవధాన్యాలు | రెండున్నర తులము |
| గంధమూలి | రెండున్నర తులము |
| ఉసిరి | రెండున్నర తులము |
| కిస్‌మిస్ | ఐదు తులములు |
| జటామాసి | ఐదు తులములు |
| నాగకేసరములు | రెండున్నర తులము |
| వక్కలు | ఐదు తులములు |
| వేపాకు | రెండున్నర తులము |
| పంచదార | పది తులములు |
| నెయ్యి | పది తులములు |

# ఈశ్వరుడు ప్రత్యక్షసిద్ధమా ?

"త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి
త్వామేవ ప్రత్యక్షం బ్రహ్మ వదిష్యామి"

ప్రపంచమున నేదేని యొకపదార్థము - వస్తువు - ఉన్నదని కొండొక వ్యక్తి చెప్పినంతమాత్రమున నది యున్నదని యంగీకరింపవలసిన యగత్యము లేదు. ఆ చెప్పిన వ్యక్తి యెంతటి విద్వాంసుడైనను ఎంతటి గొప్ప పేరు ప్రతిష్ఠలు కలవాడైనను కానిండు అతడొక పదార్థము ఉన్నది యని ప్రతిజ్ఞ (Statement) చేసినంతమాత్రమున నది యున్నదని యంగీక రింప వలయునను నియమములేదు. అందువలననే తాత్త్వికులు "లక్షణ ప్రమాణాభ్యాం వస్తుసిద్ధిః న తు ప్రతిజ్ఞామాత్రేణ" 'లక్షణ ప్రమాణ ముల ద్వారమున వస్తువు సిద్ధించును గాని 'ఉన్నది' అని యొకరు నోటితో నుడివినంతమాత్రమున నది యున్నట్లు కాదు.

లోకమున నేదేని యొకవస్తువు ఉన్న పక్షమున దానిని లక్షణ ప్రమాణములతో నది యున్నది. దానియునికిలో నెట్టి సందేహములేదని వినువారికి బోధపఱపవలయును. అదియును కేవలము మాటలతోగాక లక్షణప్రమాణముల మూలమున ఋజువు చేయవలయును.

లక్షణ ప్రమాణములననేమి? అని పాఠకులు ప్రశ్నింపవచ్చును. లక్షణము, ప్రమాణము అను నీరెండు శబ్దములు దర్శనములకు అనగా తత్త్వశాస్త్రములకు సంబంధించినవి. ఇవి కావ్యనాటకాది సాహిత్యగ్రం థములలో సరియైన అర్థములలో సాధారణముగ వాడబడు పదములు కావు. కావున సాధారణ పాఠకులు వీనియర్థముల నెఱుగరు. కావున నిట ప్రమాణ పదమును ముందుగా వివరించి తదుపరి లక్షణమననేమో పాఠకులకు తెలుప యత్నింతును.

ప్రమా అంటే జ్ఞానము - తెలివి. ప్రమాణము అంటే జ్ఞానసాధనము.

'జ్ఞానము-తెలివి' అనునది యేదోయొకవస్తువునకు సంబంధించియుండును. ఆ తెలివి - జ్ఞానము - శబ్దముచే వ్యవహరింపబడును. ఉదాహరణముకొ ఒకు ఒక గోవు - ఆవు - ఉన్నదను కొనుడు. దానిని కంటితోచూచి మనము 'ఇది గోవు' అందుము.- అనగా మనకు గోవును చూడగానే 'ఇది గోవు' అని తెలివి - జ్ఞానము కలిగిన దన్నమాట. మనకు కలిగిన జ్ఞానమును 'ఇది గోవు' అను శబ్దము తో వ్యవహరించుచున్నాము - చెప్పుచున్నాము. ఇట మనకు కలిగిన జ్ఞానము యొక్క స్వరూపము 'ఇది గోవు' అను నాల్గుఅక్షరములు. ఇదియే ప్రమా-జ్ఞానము-తెలివి. ఈ మూడు పదములు సమానార్థకములు - అనగా ఒకే యర్థమును బోధించును. గోవును చూచినపుడు మనకు కలుగు 'ఇది గోవు' అను జ్ఞానము మనకంటి మూలమున కలిగినది. అనగా మనకు కల్గిన 'ఇది గోవు' అను జ్ఞానమునకు మనకన్ను సాధనమైనది. అనగా కంటివలన 'ఇది గోవు' అను జ్ఞానము కలిగినది. జ్ఞానమును దార్శనికులు తత్త్వ శాస్త్రకారులు 'ప్రమా' అందురు. ఆ ప్రమ దేనిమూలమున కలుగునో అదియే జ్ఞానసాధనము - ప్రమాసాధనము. అట్టి ప్రమాసాధనమే ప్రమాణమనబడును. ఇట ప్రస్తుతము 'ఇది గోవు' అను జ్ఞానము - ప్రమా, మనకు కంటిమూలమున కలిగినది. కావున కన్ను ప్రమాసాధనమై ప్రమాణము అనబడును. ఇప్పుడు ప్రమాణమననేమో పాఠకులకు బోధపడియుండవచ్చును. ఇట్లు మనకు కంటితో లోకమున రంగులుగల స్థూల వస్తువుల జ్ఞానము కలుగును. 'ఇది ఘటము, ఇది పటము, ఇది గోవు, ఇది పుస్తకము అని అనేక వస్తువుల జ్ఞానములు కంటితో కలుగును. ఇట్టి జ్ఞానములు కంటితో నెల్లరకు సమానముగా కలుగును. కావున ఈ జ్ఞానముల కన్నిటికి కన్ను ప్రమాణము. ఇట్టి జ్ఞానమును కలిగించు కంటికి ప్రత్యక్షప్రమాణమని దార్శనికులందురు. ఈ ప్రత్యక్ష ప్రమాణము ద్వారమున నేవస్తువు జ్ఞానము కలుగునో అవస్తువున్న దని యెల్లరు నంగీకరింతురు - అనగా ఆ వస్తువు యొక్క యునికిలో నెవ్వరికి నెట్టి సందేహము ఉండదని భావము. ప్రత్యక్షమనగా ప్రతి - అక్షము అనగా ఇంద్రియము, ప్రత్యక్షము అనగా ప్రతి ఇంద్రియము అని అర్థము. కావున ప్రతి ఇంద్రియము ప్రత్యక్ష ప్రమాణమనబడును. మనకు జ్ఞానము కలిగించు ఇంద్రియములు మన శరీరములో ఐదు

ఉన్నవి. కన్ను, ముక్కు, చెవి, జిహ్వ (నాలుక) త్వక్కు (చర్మము) - వీనినే 'త్వక్చక్షు శ్రోత్రజిహ్వా ఘ్రాణము' లని యొక్కమాటలో చెప్పవచ్చు. వీనిమూలమున ఇవి సాధనములుగ - జ్ఞానము కలుగును. కావున ఇది పంచజ్ఞానేంద్రియములనబడును. ఈ పంచజ్ఞానేంద్రియము లును ప్రత్యక్ష ప్రమాణమనబడును. ప్రత్యక్ష ప్రమాణమువలన కలుగు జ్ఞానము ప్రత్యక్షజ్ఞానము అందురు. ఈ విధముగ 'గోవు ఉన్నది' అనుటకు ఋజువు (ప్రమాణము) ప్రత్యక్ష ప్రమాణము - కన్ను - అని చెప్పెదుము. వాయువు ఉన్నదనుటకు - ఋజువు - ప్రమాణము - త్వగింద్రియము. ఇట్లే రుచులు గలిగిన వస్తువులున్నవనుటకు ప్రమా ణము జిహ్వ - నాలుక, వాసనగలిగిన వస్తువులున్నవనుటకు ఘ్రాణము - నాసిక ప్రమాణము. శబ్దములుగల వస్తువులున్నవనుటకు శ్రవణము - చెవి ప్రమాణము ఇట్లు లోకములో కొన్ని వస్తువులున్నవనుటకు ప్రత్యక్ష ప్రమాణము ప్రమాణమందుము.

ఇట్టి ప్రమాణములు తత్త్వశాస్త్రకారులు - దార్శనికులు సామాన్య ముగా నాలుగు ప్రమాణము లంగీకరింతురు. (1) ప్రత్యక్షము (2) అనుమానము (3) ఉపమానము (4) శబ్దము. ప్రత్యక్ష ప్రమాణము పైపంక్తులలో వివరింపబడినది. మిగిలిన ప్రమాణములను సంక్షేపముగ నిట వివరించుచున్నాడ.

ప్రత్యక్ష ప్రమాణ పూర్వకము అనుమాన ప్రమాణమన బడును. రెండు వ్యాప్యవ్యాపక సంబంధముతో సంబద్ధములై యుండు వస్తువు లలో నొకవస్తువు ప్రత్యక్షముకాగా దానితో సంబద్ధమై యుండు రెండవ వస్తువు ఊహించి తెలిసికొనబడును. ఉదాహరణము :- పొగను ప్రత్యక్ష ప్రమాణముతో తెలిసికొని దానిమూలమున దూరమున నుండి కనబ డని అగ్నిని ఊహించి తెలిసికొందుము. ఈ విషయమున దూరమున పొగపైకి లేచుట కంటితో చూతుము. కావున పొగ ప్రత్యక్ష జ్ఞానము. దానితో పొగ ఉన్నచోట అగ్ని ఉండునని ఊహించి తెలిసికొందుము. అట్టియెడ కలిగిన జ్ఞానము అనుమితి జ్ఞానమనబడును. ఈ జ్ఞానము కలుగుటకు ప్రత్యక్షముగా తెలిసిన పొగజ్ఞానము సాధనము. కావుననిట పొగ అనుమాన ప్రమాణము. ఈ యనుమాన ప్రమాణమున ననేక భేదములున్నవి. వానిని వివరముగా న్యాయదర్శనాది గ్రంథములలో

తెలియనగును.

మూడవది ఉపమాన ప్రమాణము రెండు వస్తువులలో గల సాదృశ్యము తెలిసినపుడు తెలిసినవస్తువులోగల సాదృశ్యము ద్వారమున తెలియనివస్తువును తెలిసికొనుట ఉపమానప్రమాణ ప్రయోజనము. గ్రామములో నుండు గోవువలె అరణ్యమున గవయము ఉండును. గోవు నెఱిగినవ్యక్తి అడవిలో నున్న గవయమును చూచి అది గోవువలె నున్నది. అనగా గోవు సాదృశ్యము తన యెదుటనున్న ఆటవిక జంతువులో చూచి అది గవయమని తెలిసికొనును. ఈ తెలివి - ఈ గవయజ్ఞానము ఉపమితి జ్ఞానమనబడును. ఇట గోగవయవములలో నుండు సాదృశ్యజ్ఞానమే ప్రమాణము. ఇది ప్రత్యక్షము కాదు. అను మానముకాదు.

ఇక శబ్దప్రమాణము, ఆప్తవాక్యము శబ్దప్రమాణము, ఆప్తులు యథార్థము చెప్పువారు. అట్టివారు చెప్పువాక్యమువలన గూడ జ్ఞానము కలుగును. ప్రత్యక్షము, అనుమానము, ఉపమానము అను ప్రమాణములవలన తెలియని విషయజ్ఞానము శబ్దప్రమాణమువలన కలుగును. ఉదాహరణమునకు తల్లిదండ్రుల జ్ఞానము సంతానమునకు తమతల్లిచెప్పిన వాక్యముల వలన - శబ్దములవలననే కలుగును. మఱియే ప్రమాణమువలనను కలుగదు. ఇట్లు లోకమునగల వస్తువుల - వ్యక్తుల - విషయముల జ్ఞానముపైన వివరించిన ప్రమాణములలో నేదోయొక ప్రమాణమువలననో అనేక ప్రమాణములవలననో కలుగును. మఱియొకవిధములేదు. ఇట్లు ప్రమాణములను వివరించిన మీదట లక్షణమును గూర్చియు వివరింపవలసి యున్నది. ప్రమాణము ద్వారమున నొకవస్తువుయొక్క ఉనికిని తెలిసికొనిన మీదట అవస్తువుల లక్షణముగూడ చెప్పినప్పుడే అవస్తువును పూర్తిగా తెలిసికొని నట్లగును.

ఉదాహరణము :- ప్రత్యక్ష ప్రమాణముతో 'ఇది గోవు' అని తెలిసికొనిన తరువాత దాని లక్షణము చెప్పవలయును. లక్షణమనగా నొకవస్తువులో నుండు విశేషధర్మము. 'అసాధారణ ధర్మో లక్షణమ్' అని దార్శనికులు చెప్పుదురు. అసాధారణ ధర్మమనగా విశేషధర్మము. ఒక వస్తువులో నుండు ధర్మము - గుణము - మఱియొక వస్తువులో దేనియందును లేకుండిన నది విశేషధర్మము - అసాధారణ ధర్మమనబడును. ఆ విశేషధర్మము తనకాశ్రయమగు వస్తువును ఇతర సమస్త

పదార్థములనుండి వేఱుచేసి ఇది ఫలానావస్తువని బోధించును. ఉదాహరణమునకు గోవునందుగల విశేషధర్మము సాస్నాదిమత్త్వము. సాస్నా అనగా గంగడోలు. గోజాతి మెడక్రింద వ్రేలాడు తోలు, ఈ గంగడోలు మఱియేజంతువు మెడక్రిందను వ్రేలాడుచుండుట జూడము. కావున గంగడోలు (సాస్నా) కలిగియుండుట గోవునందుగల విశేషధర్మము - అసాధారణ ధర్మము. అదియే గోవును ఇతర జంతువులనుండియు సమస్తేతరపదార్థముల నుండియు వేఱుచేసి 'ఇది గోవు' అని తెలియ జేయును. ఇట్లు లక్షణ ప్రమాణముల ద్వారమున కొండొక వస్తువు ఉన్నదని చెప్పిన దానినెవ్వరు కాదనజాలరు. అట్టి వస్తువు లోకమున నున్నదని యెల్లరు అంగీకరింతురు.

ఇట్లు లక్షణ ప్రమాణముల ద్వారమున కొండొకవస్తువు ఉనికి నిర్ణయింపవలయునని తెలిసినమీదట ఈశ్వరుడను పదార్థమొకటి యున్నది. అని చెప్పినప్పుడు ఆ యీశ్వరతత్త్వమును లక్షణ ప్రమాణములతో సిద్ధపఱచుట కర్తవ్యమగుచున్నది. ఈశ్వరు నంగీకరింపని నాస్తికులు - లోకాయతికులు చార్వాకులు నేటి కమ్యూనిష్టులు, హేతువాదులమని చెప్పుకొను (Socalled Rationalists or Humanists) హ్యూమనిష్టులు మున్నగువారు ఈశ్వరుడు ప్రత్యక్ష ప్రమాణ సిద్ధుడు కాదు కావున ఈశ్వరుడను నొకతత్త్వమున్నదని యేల యంగీకరింపవలయును? అని ప్రశ్నింతురు. ఏలయన :

ప్రత్యక్ష ప్రమాణముచే సిద్ధించు వస్తువులలో శబ్దస్పర్శ రూపరసాది గుణములలో నేదోయొక గుణముండవలయును. అప్పుడే ఆ వస్తువు ఇంద్రియములలో నేదోయొక ఇంద్రియముచే గ్రహింపబడును. ఈశ్వరునిలో ఇంద్రియములచే గ్రహింపబడు శబ్దస్పర్శాది ఐదు గుణములలో ఏగుణములేదు. కావున ఈశ్వరుడు ప్రత్యక్ష ప్రమాణసిద్ధుడు కాడనుట స్పష్టము. ఇంద్రియములే కదా ప్రత్యక్ష ప్రమాణము. ఇంతే కాక అనుమానోపమాన ప్రమాణ ప్రత్యక్షపూర్వకము లగుట వలన వానిచేతను ఈశ్వరుడు సిద్ధింపడు. ఇక శబ్దప్రమాణమందురా! శబ్దప్రమాణము ఆప్తవాక్యములు, వేదములేకదా! మానవులలో ఆప్తులనబడదగినవారు ప్రత్యక్షాది త్రివిధప్రమాణములతో ఈశ్వరుని సిద్ధింపజేయక వేదవాక్య

ములను ప్రమాణముగా చెప్పుదురు. అనగా శబ్దప్రమాణముతో ఈశ్వరుని యునికిని తెలుపుదురు. ఆవేదములు ఈశ్వరీయములందురు. ముందు ఈశ్వరుడు లక్షణ ప్రమాణములతో సిద్ధించిన గదా వేదము లీశ్వరీయములై శబ్దప్రమాణమగును. కావున వేదములు చెప్పుచున్నవి కావున ఈశ్వరుడున్నాడనుట యుక్తి యుక్తము - హేతుబద్ధముకాదు. కాబట్టి ఈశ్వరుడు ప్రమాణ సిద్ధుడు కాదు. అనగా ప్రమాణములతో ఈశ్వరుడున్నాడనుట సిద్ధింపదు. ఉనికి సిద్ధించిన మీదట లక్షణము చెప్పవలసియుండును. ఉనికియే సిద్ధము కానపుడు ఈశ్వరునికి లక్షణమేముండును? ఇది ఈశ్వరుడు లేడనువారి వాదము.

ఇందులకు సమాధానముగా మహర్షి దయానందసరస్వతీ స్వామి - ఆర్యసమాజసంస్థాపకుడు - ఈశ్వరుడను తత్త్వము ప్రత్యక్షాది సర్వప్రమాణముల మూలమున సిద్ధించునని తనచే రచింపబడిన సత్యార్థప్రకాశమున స్పష్టముగా వివరించియున్నాడు. అది యెట్లందురేని.

1) ప్రశ్న:- ఈశ్వరునియందు ప్రత్యక్షాది ప్రమాణములు ఘటిల్లనేరవు.

సమాధానము:- "ఇంద్రియార్థ సన్నికర్షోత్పన్నం జ్ఞానమవ్యపదేశ్యమవ్యభిచారి వ్యవసాయాత్మకం ప్రత్యక్షమ్ - న్యాయదర్శనమ్".

'శ్రోత్రము, త్వక్కు, నేత్రము, జిహ్వ, నాసిక మనస్సు అనునీ యింద్రియములతో క్రమముగ శబ్దము, స్పర్శ, రూపము (రంగు) రసము (రుచి) గంధము (వాసన), సుఖదుఃఖములు అను విషయములకు సంబంధము కలిగినపుడు జ్ఞానము కలుగును. ఆ జ్ఞానమును ప్రత్యక్ష జ్ఞానమందురు. కాని అజ్ఞానము భ్రమరహితముగా నుండవలయును.

ఇప్పుడు ఇక్కడ ఇట్లు ఆలోచింపవలయును. ఇంద్రియములవలన మనస్సువలన గుణముల జ్ఞానమేకలుగును. కాని, గుణి (వస్తువు) యొక్క జ్ఞానము కలుగదు. త్వక్కుమున్నగు ఇంద్రియములవలన స్పర్శమున్నగు గుణములు ప్రత్యక్ష మగునట్లు ఆగుణములుగల పృథివి (వస్తువు) ఆత్మతో కూడిన మనస్సువలన ప్రత్యక్షమగును. ఆవిధముగనే మనకు ప్రత్యక్షమగుచున్న యీ సృష్టిలో రచన మున్నగు కర్మలు

జ్ఞానాదిగుణములు ప్రత్యక్షమగుటవలన పరమేశ్వరుని ప్రత్యక్ష జ్ఞానము కలుగును. (ఇది యొక ప్రత్యక్ష విధము).

(ఇక రెండవ ప్రత్యక్ష విధము:-) మనుజుడు మంచి చెడు కర్మలు చేయునపుడు - జీవుడు మనస్సును, మనస్సు ఇంద్రియములను ఆ కర్మలయందు లగ్నముచేయును. జీవుడు పరోపకారాది మంచిపనులు లేక చౌర్యము మున్నగుచెడ్డపనులు చేయునపుడు ఆక్షణమున జీవునికోరిక, జ్ఞానము మున్నగు గుణములు అతడు కోరి చేయుపనులలో లగ్నమైయుండును. ఆక్షణముననే ఆ మనుజుని ఆత్మయందు చెడ్డపనిచేయునపుడు భయశంకాదులు, మంచిపని చేయునపుడు నిఃశంకత, ఆనందోత్సాహాదులు కలుగును. అవి యాజీవాత్మునివలన కలుగునవి కావు. పరమాత్మునివలన కలుగును. (ఇట్లు పరమాత్మ ప్రత్యక్షమగునని భావము).

మఱియు జీవాత్మ శుద్ధుడై పరమాత్ముని గుఱించి ఆలోచింప తత్పరుడగునపుడు జీవునకు రెండును (జీవాత్మ పరమాత్మలు) ప్రత్యక్షమగును. ఇట్లు పరమేశ్వరుడు ప్రత్యక్ష ప్రమాణముతో సిద్ధమగుచుండ అనుమానాది మిగిలిన ప్రమాణములతో పరమేశ్వరుని జ్ఞానము కలుగుటలో సందేహమేల? కార్యమును జూచి కారణము నెఱుగగలము గాదా? (స.ప్ర.సప్తమ సముల్లాసము)

ప్రత్యక్ష ప్రమాణమన నేమో ఈ వ్యాసమున ప్రథమముననే వివరించియున్నాను. ఇందుపాఠకులు గమనింపవలసిన విషయమొకటి యున్నది. జ్ఞానేంద్రియములు ప్రత్యక్ష ప్రమాణమను విషయము పాఠకులు మఱవరాదు. ఇంద్రియములతో బాహ్యఘట పటాది పదార్థములతో సన్నికర్షము - సంబంధమేర్పడినప్పుడు ఆ యింద్రియములవలన వస్తువులలోని రంగులు, పరిమాణము, స్పర్శ మున్నగు గుణములే తెలియును. కాని వస్తువులు తెలియవు. 'రూపగ్రాహకం ఇంద్రియం చక్షుః, రంగును గ్రహించు ఇంద్రియము చక్షువు - నేత్రము, గంధగ్రాహక మింద్రియం ఘ్రాణమ్' వాసనను గ్రహించు ఇంద్రియము ఘ్రాణము-నాసిక అని యిట్లు ఇంద్రియములన్నియు తమకు విషయములయిన శబ్దస్పర్శ రూపరస గంధములను మాత్రమే గ్రహించునని దార్శనికులు - గౌత

మాది మహర్షులు నుడువుదురు. కావున ఇంద్రియములు గుణములనే గ్రహించునుగాని గుణివస్తువును గ్రహింపవనుట శాస్త్రసిద్ధ విషయము. అటులయిన వస్తువులను గ్రహించు ప్రమాణమెయ్యది? అనగా ప్రత్యక్ష ప్రమాణమువలన గుణములు తెలియబడగా ఆ గుణములకు అశ్రయముగా ద్రవ్యము-వస్తువు ఊహింపవచ్చును. అప్పుడు వస్తువులు ప్రత్యక్షములుకాక అనుమానికములు - అనుమానప్రమాణ గ్రాహ్యములగును. ఇట్లనుట తార్కికుల కిష్టముకాదు. వాస్తవమున మనమొకవస్తువును కంటితోజూచి తెలిసికొనునపుడు ఇది ఘటము, ఇది పటము, ఇది పుస్తకము అని వస్తువుల జ్ఞానమే కలుగును కాని నలుపు తెలుపు రంగులు, పరిమాణము, కొలతల జ్ఞానము కలుగుచున్నట్లు చెప్పము. కావున ప్రత్యక్ష ప్రమాణమువలన వస్తువులలోనున్న గుణములతో బాటు గుణి-వస్తువుల జ్ఞానమేకలుగును. కేవల గుణముల జ్ఞానమే కలుగదని శాస్త్రజ్ఞుల యభిప్రాయము.

ఈ విధముగా ప్రత్యక్ష ప్రమాణమువలన వస్తువుల జ్ఞానమెట్లు కలుగుచున్నదో తెలిసికొనిన మీదట, ఈశ్వరుడుకూడ ఒక వస్తువే - ద్రవ్యమే. ప్రాచీన భారతీయ ఋషులు ఈశ్వరుని కూడ పృథివ్యాది ద్రవ్యములవంటి ద్రవ్యముగానే నుడివియున్నారు.

'పృథివ్యాపస్తేజో వాయురాకాశం
కాలో దిగాత్మా మనఇతి ద్రవ్యాణి'.

ఇది కాణాదసూత్రము. ఇందు 'ఆత్మా' పదము జీవేశ్వరులకు బోధకము. అందువలన సృష్టిలోగనబడు రచన, రచించుటకు వలయు జ్ఞానము మున్నగు గుణకర్మములు ప్రత్యక్షములయి తమ గుణియైన సృష్టికర్త ఈశ్వరుడును ప్రత్యక్ష ప్రమాణముచే గ్రహింపబడు చున్నాడని భావము. కావున ఈశ్వరుడు ప్రత్యక్ష ప్రమాణసిద్ధుడనియే సిద్ధమగుచున్నది. అందువలననే మంత్రవర్ణము - వేదము కూడ.

"త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి త్వా
మేవ ప్రత్యక్షం బ్రహ్మ వదిష్యామి"

అని చెప్పుచున్నది. ఈ మంత్రవర్ణములలో బ్రహ్మ-ఈశ్వరుడు

ప్రత్యక్ష ప్రమాణసిద్ధమనుట సుస్పష్టము - ఈ విషయమును ప్రాచీన మహర్షులు స్పష్టము చేయకున్నను - దయానందమహర్షి ఈశ్వరుడు ప్రత్యక్ష సిద్ధమేనని బాహాటముగ సత్యార్థ ప్రకాశమున బాగుగ వివరించి యున్నాడు. తత్త్వశాస్త్రాధ్యయనముచేసిన బుద్ధిమంతులెల్లరు ఈశ్వరుడు ప్రత్యక్ష ప్రమాణగమ్యుడే యని యంగీకరింతురు. ఇట్లు ప్రత్యక్షాది ప్రమాణముల మూలమున సృష్టికర్త ఈశ్వరుని యునికిని తెలిసికొనినమీ దట అతని లక్షణములను తెలిసికొనవలయును. ఆ లక్షణములు క్రింద వివరింపబడుచున్నవి.

* * * * *

## ఈశ్వరుని వైదిక స్వరూప-లక్షణాదులు

లోకమునగల వస్తువుల నిరూపణము దార్శనికులు లక్షణ ప్రమాణ ముల మూలమున చేయుదురు. ప్రమాణము ద్వారమున కొండొక పదార్థము యొక్క యునికిని నిరూపించి యటుపై దానిలక్షణాదులను జెప్పుట యుచితము. పదార్థ మొకటి యున్నదని ఋజువైనపిదప దాని లక్షణాదుల జెప్పవచ్చును. పదార్థమేలేకున్న దానిలక్షణాదులు చెప్పుటెట్లు పొసగును.

విశ్వమున బుద్ధి గోచరమగు రచన, నియమాదుల మూలమున విశ్వని ర్మాణకర్త యొకడున్నట్లు ప్రత్యక్షప్రమాణమువలన తెలియుచున్నది. ఇట్లే కార్యత్వకర్తృత్వములకుగల నియత సంబంధమువలన విశ్వమొక కార్యపదార్థము కావున దానికొకకర్త యుండవలయునని అనుమానప్రమా ణమువలనను విశ్వకర్త- సృష్టికర్త యునికి సిద్ధమగుచున్నది. కార్యము కర్త లేక సంభవింపదని యెల్లరెఱుగుదురు. కుమ్మరి లేకున్న కుండయు, సాలెవాడు లేకున్న వస్త్రము నేర్పడనేరవుకదా! విశ్వము కార్యమని సిద్ధమైనపుడుకదా దానికొక కర్త యుండవలయునని సిద్ధమగును? అని ప్రశ్నింతురేని విశ్వము కార్యమనుటలో సందేహమేల? కార్యమన పుట్టి నశించునది. భూజలాది పంచభూతాత్మకమేకదా విశ్వము, భూజ లాది పంచభూతములు పుట్టి నశించుట యెవ్వరెఱుగరు? ఒకవస్తువు కార్యమా? కాదా? యని తెలిసికొనుటకొక చిన్నయుపాయమును గుర్తుం

ఁకొనిన చాలును. అది యెద్ది యందురేని, ఏ వస్తువును మనము ముక్కలు ముక్కలు లేక ఖండ ఖండములు చేయగలుగుదుమో యది కార్యమని తెలిసికొనవలయును. కారణమేమన ఆ ముక్కలు కలిసిన పుడే యావస్తు వేర్పడును. అనగా అదిపుట్టును. ముక్కలుగా అది విడదీయబడినపుడా వస్తువు నశించును. ఇట్టి చావుపుట్టుకలు పృధివ్యాది పంచభూతములచే నేర్పడు ఎల్లవస్తువులకు, పృథివ్యాది భూతములకు నున్నవేయని తెలిసికొనుట యెల్లరికి సులభము. కావున పృథివ్యాది పంచభూతాత్మకమగు ప్రపంచము - విశ్వము పుట్టి నశించునది యనుట నిర్వివాదవిషయము. అందువలన విశ్వము. కార్యము. అట్టికార్యము కర్త లేక యేర్పడనేరదు కావున విశ్వకర్త యొకడున్నాడనుట అనుమాన ప్రమాణ సిద్ధము. మఱియును ఈ విశ్వమును సృష్టియనియు వ్యవహరింతురు. సృష్టియన సృజియింపబడినది యని యర్థము. సృజించుట యనగా సృష్టించుట - పుట్టించుట - నిర్మించుటయని యర్థము. ఇట్లు సృష్టి పుట్టినది కావున గిట్టక - నశింపక తప్పదు. ఇట్లు పుట్టి నశించునది కావున సృష్టి - విశ్వము - కార్యము అనుట నిస్సంశయము. కార్యము కర్త లేక యేర్పడదుకావున సృష్టికర్త యొకడుండుట నిశ్చితము. ఈ సృష్టికర్త ప్రత్యక్షానుమాన ప్రమాణముల మూలమున సిద్ధించిన మీదట యతని లక్షణములు కూడ కొన్ని మనము ఊహించి, తర్కించి తెలిసికొనవచ్చును. అది యెట్లన:-

కర్త కార్యమేర్పడుచోట నుండవలయును. కుండ నిర్మితమగునపుడు దాని కర్త కుమ్మరి కుండయున్నచోట నుండవలసి యుండును. కర్త యొకచోటను కార్యము మఱియొకచోటను ఏర్పడుట సంభవముకాదు, కుమ్మరి సికిందరాబాదులో నుండి హైదరాబాద్‌లో కుండను నిర్మింపజాలడు. కావున కార్యము నిర్మితమగు తావున దానినొనర్చు కర్త యుండక తప్పదను నియమము నంగీకరింపక తప్పదు. ఈ నియమము ననుసరించి సృష్టి యెక్కడెక్కడ జరుగుచున్నదోయటనట సృష్టికర్త యుండవలయును. విశ్వమున నంతటను సృష్టి జరుగుచున్నది. సృష్టియన పృథివ్యాది పంచభూతములను వాని సూక్ష్మపరమాణువులను ఒండొంటితో చేర్చి స్థూలమొనర్చుటయే కదా! అందువలన నాపరమాణువుల దగ్గఱనుండి

స్థూలమగు నాకాశము ఎంతవఱకు వ్యాపించియున్నదో అంతవఱకు సృష్టి కర్తయుండి తీఱవలయును. అనగా విశ్వకర్తవిశ్వమున నంతట నుండ వలయునని భావము. అప్పుడు సృష్టికర్త సృష్టిలో నంతట వ్యాపించి యుండును. వ్యాపక వస్తువునకు ఆకారము ఉండదు. అవయవములు నుండవు. అందువలన సృష్టికర్త నిరాకారియు నిరవయవియునై యుండ వలయును. ఆకారము లేదనిన అవయవములు వాని కూర్పులేదనియే భావము. ఇట్లు సృష్టికర్త నిరవయవి, నిరాకారుడని తర్కసిద్ధుడగుచు న్నాడు. సృష్టికర్తను ఈశ్వరుడందుము. ఈశ్వరుడను పదము పుంలింగ - పురుష - వాచకమగుటచేత సృష్టికర్త మానవునివలె శరీరధారి యని యెంచరాదు. శరీరధారి విశ్వమున నంతట నుండనేరదు. అతడొక సీమిత ప్రదేశమున నుండు ఏకదేశి యగును. ఏకదేశి వ్యాపకుడు కాడు. ఈశ్వరుడు సృష్టికర్త కావున సృష్టిలో నంతటనుండు నొక వ్యాపకతత్త్వము - పదార్థముగా తెలిసికొనవలయును.

ఇట్లు ఈశ్వరుడు వ్యాపకతత్త్వమై తనచే నిర్మింపబడు నీ సృష్టి నంతటిని తనలోనే యుంచుకొనును. అనగా నీసృష్టికి ఈశ్వరుడే ఆధా రమగునని భావము. సృష్టిని మనము జగత్తు అనియు నందుము. కావున ఈశ్వరుడు జగత్తున కంతటికి ఆధారమై జగదాధారుడనియు పిలువబడుచున్నాడు. ఇంతవఱకు ఈశ్వరుడు సృష్టికర్త. వ్యాపకుడు, నిరాకారుడు నిరవయవి. జగదాధారుడునని తర్కము - ఊహ - హేతువు వలననే తెలిసికొనినాము.

ఈ సృష్టిని సంస్కృతమున సర్వము అందుము. సర్వమనగా అంతయునని అర్థము. ఈశ్వరుడు జగత్తును - సర్వమును వ్యాపించి యుండును. కావున ఈశ్వరుడు సర్వవ్యాపకుడు అనబడును. ఈశ్వరుడు వ్యాపకుడు. జగత్తు - సర్వము- వ్యాప్యము. వ్యాపకము ఎక్కువస్థలము నాక్రమించునది. వ్యాప్యము తక్కువ స్థలము నాక్రమించునది. కావున ఈశ్వరతత్త్వము విశ్వము - జగత్తుకంటెను గొప్పది అని తెలియనగును.

గచ్ఛతి ఇతి జగత్తు అనగా జగత్తు నడచునది - గమన స్వభావము కలది అని అర్థము ఈ జగత్తునగల అత్యంత సూక్ష్మములైన పరమా ణువులు మొదలుకొని భూమ్యాది గ్రహములు, చంద్రాది ఉపగ్రహములు, సూర్యాది గొప్పనక్షత్ర గోళములు నన్నియు నతివేగముగ చలించుచు గమనశీలములై యున్నట్లు నేటి వైజ్ఞానికులును చెప్పుచున్నారు. ఇట్లు

జగత్తంతయు గతిశీలమై అతివేగముతో చలించుచున్నదనియు అందువల ననే జగత్తని పిలువబడుచున్నదని సిద్ధమగుచున్నది. లోకమున గతిశీల మగు వస్తువునకు గతిలేని స్థిరముగా నుండు వస్తువొకటి ఆధారముగ నుండుట నెల్లరెఱుగుదురు. కదలని యిరుసు నాధారము చేసికొని చక్రము తిరుగుచుండును. కదలని రైలుపట్టాల నాధారముచేసికొని రైలు బండి అతివేగముగా పరుగిడుచున్నది. కదలని దూలము నాధారము చేసికొని ఊయెల ఊగును. అట్లే యీ జగత్తు కూడ ఒకానొక కదలని పదార్థము నాధారము చేసికొని తాను అతివేగముగ చలించు చున్నదని తెలియనగును. అట్టి ఈ చలనాత్మక జగత్తునకాధారమైన కదలక యుండు పదార్థమే ఈశ్వరతత్త్వము. కావున ఈశ్వరుడచలు డనబడుచున్నాడు. "అచలోఽయం సనాతనః" ఇంతవఱకు ఈశ్వ రుడు సృష్టికర్తనిరాకారుడు, నిరవయవి, సర్వవ్యాపకుడు, అచలుడునని సిద్ధమగుచున్నది.

వ్యాపకవస్తువునకు అద్యంతములుండవు కావున ఈశ్వరుడు అనాది, అనంతుడు. అనాది-అనగా ఆది కారణములేనిది. అనంతము అనగా అంతము - నాశము - లేనిది కావున అనంతము అని భావము. కారణము కలిగినది - పుట్టుక కలిగినది నశించును. ఈశ్వరుడనాద్యనం తుడు. కావున నతడు చావుపుట్టుకలు లేనివాడు. అందువలన నతడు అజుడు అవినాశియగును.

జగత్తు - సర్వమును సృష్టించువాడు కావున ఈశ్వరుడు సర్వజ్ఞుడ నబడును. ఎవడు దేనిని సృష్టించునో అతడు దాని జ్ఞానము కలిగియుం డును. తనకు తెలియనిదానిని తానెట్లు సృష్టింపగలడు? ఈశ్వరుడు సర్వమునెఱిగి సృష్టించును కావున సర్వజ్ఞుడనబడును. 'సర్వం జానాతి ఇతి సర్వజ్ఞః'

ఈశ్వరుడు ఈ సర్వజగత్తును సృష్టించుటకు తానెవరి సహాయము నపేక్షింపడు. తన అనంతసామర్థ్యముతోనే తానీ జగత్తును సృష్టించును. కావున ఈశ్వరుడు సర్వశక్తిమంతుడనబడును.

ఈశ్వరుడెల్లపుడు నుండును. వ్యాపక వస్తువునకు నాశముండదు. కావున ఈశ్వరుడు 'సత్' అనబడును. 'సత్' అతని స్వరూపము. అతనిలోనుండు విశేషగుణము - అసాధారణ గుణము కావున ఈశ్వ

రుడు సత్స్వరూపుడు. ఈశ్వరునిలో చిత్ - జ్ఞానము తప్ప అజ్ఞాన మిసుమంతయులేదు. కావున ఈశ్వరుడు చిత్ స్వరూపుడు. అట్లే యతడు ఆనందము - సుఖము - నిరతిశయసుఖము అసాధారణగుణముగా గలవాడు కావున ఈశ్వరుడు ఆనంద స్వరూపుడనబడును. ఇట్లు ఈశ్వరుడు సచ్చిదానంద స్వరూపుడనియు తెలియనగును.

ఈశ్వరుడు భూతభవిష్య ద్వర్తమానమగు కాలభేదము లేక యెల్ల కాలము లందుండును. కావున నతడు నిత్యుడనబడును. 'త్రికాలాబాధ్యత్వం నిత్యత్వమ్' నాశము లేక భూత భవిష్య ద్వర్తమానము అని వ్యవహరింపబడు త్రికాలములందుండువాడు కావున ఈశ్వరుడు నిత్యుడనబడును.

ఇట్లే జగద్రూపకార్యము మూలమున తత్కర్తయగు ఈశ్వరుని సృష్టికర్త, నిరాకారుడు, నిరవయువి, జగదాధారుడు, సర్వవ్యాపకుడు, అనాది, అనంతుడు, అచలుడు, సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు, సచ్చిదానందస్వరూపుడు, నిత్యుడునని అనేక లక్షణములు కలవాడుగా తెలిసికొన గలుగుచున్నాము. ఇట్లే ఈశ్వర స్వరూపలక్షణాదులను వేదాది శాస్త్రములు వర్ణించుచున్నవి.

"ఈశావాస్యమిదం సర్వమ్
యత్కించ జగత్యాం జగత్" యజు.40-1

ఇదం సర్వం=ఈ జగత్తంతయు, ఈశా=ఈశునిచే, వాస్యం=ఆచ్ఛాదింపదగియున్నది, జగత్యాం=ఈ సృష్టియందలి, యత్కించ జగత్=ఏకొంచెము జగత్తు - చలాయమానమగు ఏ చిన్న పదార్థముకలదో అదియు ఈశునిచే వ్యాపింపబడి యున్నది. అని పై మంత్రవర్ణముల కర్థము. ఇందు ఈశుడు అనుపదము ఈశ్వరవాచకము. ఈశుడు అనగా (ఈశ నియమనే) నియమించువాడని యర్థము. ఈశుడు విశ్వమునంతటిని రచయించి దానిలోనంతట వ్యాపించియుండి విశ్వమునందలి గ్రహోపగ్రహాలు నక్షత్రములన్నియు, తమ అక్షములమీద భ్రమించుచుండ వానిని చుట్టి గ్రహములు, ఉపగ్రహములు తమ పరిధులలో తిరుగుచునుండును. ఇవియన్నియు నొక దానితో మఱియొకటి ఢీ కొనకుండ తిరుగుచుండుటకు ఈశ్వరుడే కారణము. అందువలననే యతడు ఈశుడనబడును.

"స పర్యగాచ్ఛుక్రమకాయ మవ్రణ
మస్నావిరగ్ం శుద్ధ మపాపవిద్ధం
కవి ర్మనీషీ పరిభూః స్వయంభూర్
యాథా తథ్యతోర్థాన్ వ్యదధా చ్ఛా శ్వతీభ్యః సమాభ్యః" యజు.40

సః=ఆయీశ్వరుడు, పరి=అంతటఌ, అగాత్=ఉన్నాడు, శుక్రమ్=శుక్రమ్-వీర్యమ్-శక్తి. కావున అతడు శక్తిశాలి. అనగా సృష్టి స్థితిలయములు చేయగల శక్తిమంతుడనిభావము. అకాయమ్=కాయ మన శరీరము అది లేనివాడు, అవ్రణమ్=వ్రణరహితుడు, అస్నావిరం=నాడీబంధన రహితుడు, శుద్ధం=నిర్మలుడు - రాగాదిదోషరహితుడు, అపాపవిద్ధం=పాపలిప్తుడు కాడు, కవిః=క్రాంతదర్శి - సర్వజ్ఞుడు, మనీషీ=మనసాంఈశః=సర్వప్రాణుల మన స్సులకు అధిపతి, పరిభూః=సమస్తమును వశమున నుంచుకొనువాడు. స్వయంభూః=స్వయంసత్తాకలవాడు. అన్యనిర్మితుడుకాడు (Ever existant), యాథా తథ్యతః=యథాతథముగ - ఏది యెట్లుండవలయునో అట్లు, అర్థాన్=పృథివ్యాది పదార్థములను, శాశ్వతీభ్యః సమాభ్యః=ఎల్ల పుడు మార్పులేక సచ్చిత్ స్వరూపులగు, సమాభ్యః=జీవులకొఱకు, వ్యద ధాత్=రచించును. ఇది మంత్రములోని పదములకర్థము.

సృష్టికర్తయగు ఈశ్వరుడు వ్యాపకుడు. అందువలన నతడు సర్వజగ త్తును రచించి పోషించి లయము చేయగల శక్తిమంతుడు. అందువలననే యతనికి - అవ్యాపక తత్త్వమునకు సావయవశరీరముండదు. ఈ మంత్ర మునందు శరీరమునకు సంబంధించిన పదములు మూడు (అకాయమ్, అవ్రణమ్ అస్నావిరగ్ం) అను పదములున్నవి. అందువలన ముప్విధ ములగు శరీరములు ఈశ్వరునకుండవని తెలుపబడినది. సాధారణముగ ప్రాణులకు ముప్విధములైన శరీరములుండును. ఒకటి స్థూలశరీరము. రెండవది సూక్ష్మశరీరము, మూడవది లింగశరీరము లేక కారణశరీరము - చర్మము మొదలు ఎముకలవఱకు నుండు పదార్థములతో కూడి మనయింద్రియములకు గనబడు ప్రాణులశరీరములు స్థూలశరీరములనబ డును. పంచప్రాణములు (ప్రాణము, అపానము, ఉదానము, సమా నము, వ్యానము) పంచ జ్ఞానేంద్రియములు (శ్రోత్ర, త్వక్, నేత్ర, జిహ్వా, ఘ్రాణములు) పంచకర్మేంద్రియములు (వాక్, పాణి, పాద,

పాయూపస్థలు) మనస్సు, బుద్ధి అను నీ పదునేడు స్థూలశరీరములో నుండు సూక్ష్మపదార్థములు సూక్ష్మశరీరమనబడును. సమస్తశరీరములకు కారణభూతమగు ప్రకృతి లింగశరీరము లేక కారణ శరీరము అనబడును. ఈ ముఇ్వ్విధములగు శరీరములచేతను జీవుడు బంధింపబడును. అట్టి ముఇ్వ్విధశరీరములు లేనివాడు ఈశ్వరుడని మంత్రగతములగు అకాయాదిపదముల భావము, అనగా ఈశ్వరుడు బంధన రహితుడు - నిత్యముక్తుడు - ఎన్నడును శరీరబంధమున పడని వాడని తాత్పర్యము. ఈశ్వరుడు జీవులకువలెగాక రాగద్వేష మోహమదమాత్సర్యాది దోషరహితుడు. అట్లే జీవులు అశుభకర్మలుచేసి వానిమూలమున అశుద్ధులగుదురు. కాని, ఈశ్వరుడు శుభాశుభకర్మలేవియు చేయడు కావున అతడు పాపవిద్ధుడు - పాపములచే లిప్తుడు కాడు. పరమేశ్వరుడు కవి - క్రాంతదర్శి - సర్వపదార్థములను లోపల - వెలుపల అనుభేదము లేక సమస్తము నెఱుగువాడు. మఱియు నతడు వేదరూపకావ్యరచయిత కూడ. 'పశ్యదేవస్య కావ్యం న మమార న జీర్యతి' ఈశ్వర నిర్మిత వేదకావ్యము జీర్ణింపదు - నశింపదు. కావున నది నిత్య కావ్యము. ఈశ్వరుడు నిత్యుడు కావున నతని జ్ఞానమగు వేదముకూడ నిత్యము - విశ్వమునందుగల ప్రాణులకు సంబంధించిన మనస్సులన్నియు ఈశ్వర రచితములే. కావున వాని కన్నిటికి నధిపతియై మనీషి యనబడును. ఈశ్వరునెవ్వరు పరిభవింపజాలరు. అతడన్నింటిపై విరాజిల్లు చుండును. అన్నియు నతనివశముననే యుండును. కావున నతడు పరిభువు. ఈశ్వరుడు సత్స్వరూపుడు. ఎల్లప్పుడు నుండుటయే యతని స్వరూపము - లక్షణము. అతని యునికికి మఱియొక నిమిత్తములేదు. కావున నతడు స్వయంభువు - స్వయంసత్తా కలవాడు. నిత్యసత్త్వుడు. అట్లే నిత్యసత్త్వము కలిగి శాశ్వతములై - పరివర్తన రహితములై యెల్లపుడు నుండి నిత్యములగు జీవులకు కర్మఫలముల నందజేయుటకు తగినట్లుగా నీ విశ్వములోని పృథివ్యాది పదార్థ జాతమును నీశ్వరుడు రచించు చుండును. ఈశ్వరుడు సృష్టి స్థితి - లయములు చేయుచుండును. జీవులకు వారు చేయు కర్మలకు తగినట్లు న్యాయ్యముగ ఫలముల నొసంగుచుండును. ఇంతకుమించి యీశ్వరుని కార్యములు లేవు.

ఇంతవఱకు వేదమునందువర్ణింపబడిన యీశ్వరుని ఉనికి, యతని గుణకర్మ స్వరూపస్వభావములను సంక్షేపముగ వర్ణించినాము. ఇక ముందు ఋషి ప్రణీతములగు ఉపనిషత్తులు, తత్త్వశాస్త్రములు - దర్శనములు - మున్నగు వానియందుగల యీశ్వరుని లక్షణాదుల నొకింత వ్రాయుదుము.

"యతో వా ఇమాని భూతాని జాయంతే
యేన జాతాని జీవంతి, యత్ప్రయం
త్యభిసంవిశంతి తద్విజిజ్ఞాసస్వ తద్ బ్రహ్మ" తై.ఉ.

ఇందలి బ్రహ్మపద మీశ్వరవాచకమే. ఈశ్వరుడు వేదశాస్త్రములలో ననేక నామములతో చెప్పబడును. ఈశ్వరుడు, బ్రహ్మము, విష్ణువు, నారాయణుడు, శివుడు, మహాదేవుడు, అగ్ని, సూర్యుడు, ఇంద్రుడు, వాయువు మున్నగు నామములెన్నియో యున్నవి. అవి యన్నియు నతని గుణకర్మ స్వభావములను తెలుపునని గుర్తింపవలయును. ఉదాహృతమగునుపనిషద్ వాక్యమునందు, బ్రహ్మము అనగా నీశ్వరుడు సృష్టి స్థితి లయములకు కర్తయని వివరింపబడినది. అందలి పదముల కర్థము:-

యతఃవా=ఎవనివలన, ఇమాని భూతాని=ఈపృధివ్యాది భూతములు, జాయంతే=పుట్టుచున్నవో, యేన జాతాని జీవంతి=ఎవనిమూలమున పుట్టినవన్నియు కొంతకాలము జీవించుచున్నవో, యత్ ప్రయంతి అభిసంవిశంతి=ప్రళయకాలమున నెవనియందు ప్రవేశించి సూక్ష్మరూపమున నుండునో, తద్ విజిజ్ఞాసస్వ=దానిని తెలిసికొనుము, తత్ బ్రహ్మ=అది బ్రహ్మము - ఈశ్వరుడు అని ఉపనిషత్పదముల కర్థము. ఈశ్వరుడు సృష్టి స్థితిలయకర్త యని తాత్పర్యము.

"అపాణి పాదో జవనో గ్రహీతా
పశ్యత్యచక్షుః స శృణోత్యకర్ణః
స వేత్తి వేద్యం న చ తస్యాస్తి వేత్తా
తమాహురగ్ర్యం పురుషం మహాన్తమ్"

'ఈశ్వరునకు పాణి పాదములు లేవు. కాని అతడు అవయవములచే చేయదగు కార్యములు చేయగలడు. అట్లే యతనికి చక్షువులు లేవు-చూడగలడు. చెవులు లేవు వినును. అతడు తెలియదగిన దానిని

తెలిసికొనును. అతనిని తెలిసి కొనువాడు లేడు'. ఇది ఉపనిషత్ తాత్ప ర్యము.

ఇక దర్శనములలో నొకటియగు వేదాంత దర్శనమున వ్యాసమహర్షి. "జన్మాద్యస్య యతః" బ్ర.సూ.

"అస్య=ఈ దృశ్యమాన ప్రపంచమునకు, జన్మాది=జన్మస్థితిలయ ములు, యతః=దేనివలన కలుగునో యదియే బ్రహ్మము".

బ్రహ్మము - ఈశ్వరునివలన ఈ జగత్తుయొక్క సృష్టి స్థితిలయ ములు కలిగినవని యీ వేదాంత సూత్రాభిప్రాయము. సృష్టికర్తయగు నీశ్వరునకు కరచరణాద్యవయవములు గల శరీరము కలదా లేదా? లోక మున ఘట పటాది పదార్థముల నిర్మించు కర్తలకు అవయవసహిత శరీరములున్నవి కదా? అట్లే యీశ్వరునకేల శరీరము లేదు? అని యొక సూత్రమున శంకించి వ్యాసుడు లేదని సమాధానము చెప్పుచు న్నాడు.

"ఉపకరణ వదితి చేన్న భోగప్రసక్తేః" వే.ద.సూ.

సృష్టికర్త యగు బ్రహ్మము, ఉపకరణవత్=ఉపకరణములు - సాధ నములు - కలది, ఇతిచేత్=అని యందుమేని, న=అట్లనుట తగదు. కారణమేమన, భోగప్రసక్తేః=బ్రహ్మమునకు శరీరమున్నచో సుఖదుఃఖముల ననుభవింపవలసి వచ్చును. అని సూత్రార్థము, ఈ సూత్రమునకు శంకరాచార్యులిట్లు భాష్యము వ్రాసినారు.

"అథలోక దర్శనానుసారేణ ఈశ్వరస్యాపి కించిత్కరణా నా మాయ తనం కామేన కల్ప్యేత ఏవమపి నోపపద్యతే - భోగ ప్రసక్తేః........"

తదానీ మీశ్వరస్య ఈశ్వరత్వమపి నోపద్యతే. శాం.భా. లోకములో వస్తునిర్మాతలయిన కర్తలకు అవయవ సహితమగు శరీరములు చూడబడు చున్నవి కదా! అట్లే లోకకర్తయగు నీశ్వరునకును అవయవసహితమగు శరీరమేల యంగీకరింపరాదు? అనిన అది తగదు. కారణమేమన లోక ములోని కర్తలకువలె నీశ్వరునకును సుఖదుఃఖములు అనుభవింపవలసి వచ్చును. ఈశ్వరుడును సుఖదుఃఖముల ననుభవించునని యంగీక రింతుమేని అప్పుడతడీశ్వరుడే కాజాలడు. కారణమేమన ఈశ్వరుడనగా

నన్నిటిని వశమున నుంచుకొనువాడని యర్థము. అట్టి యీశ్వరుడు జ్వరాదులకు వశుడై సుఖదుఃఖముల ననుభవింపవలసిన వాడగునెడల నతని యాధిపత్యమునకే భంగము కలుగును. అనగా నీశ్వరుడు జ్వరాదులకు లోబడినవాడగును. అందువలన నతడీశ్వరుడే కాజాలడు. కాబట్టి యీశ్వరునకు కరచరణాద్యవయములు గల శరీర ముండునని యంగీకరింప దగదని భావము.

ఇట్లు వేదములు ఉపనిషత్తులు శాస్త్రములు నన్నియు నీశ్వరుడు శరీరరహితుడు, నిరవయవి, నిరాకారుడని బోధించుచున్నవి. ఇట్లే భగవత్ గీతయందును ఎల్లరకు జ్ఞేయపదార్థమగు నీశ్వరతత్త్వము.

"సర్వేంద్రియ గుణాభాసమ్ సర్వేంద్రియ వివర్జితమ్" భ.గీ.

సర్వేంద్రియ రహితమయ్యు ఇంద్రియ గుణములు కలిగియుండునని వర్ణింపబడుట జూచుచున్నాము.

ఇట్లు వేదశాస్త్ర బోధితుడగు నీశ్వరునే యుపాసింపవలయును.

ఈశ్వరునకు బదులుగా అనేక విధములగు విగ్రహములను కల్పించి సాకారపదార్థములను షోడశోపచారములతో పత్రపుష్పాదులతో బూజించి యీశ్వరుని సగుణోపాసన చేయుచున్నామనుట యెంతటిభ్రమయో విజ్ఞులాలోచింతురుగాక!

10-10-85 - గోపదేవ్

# వైదికత్రైతవాదము

ఈ దృశ్యమాన విశ్వమునకు మూలపదార్థము లెన్ని? ఒకటియా? రెండా? మూడా? అవి యెయ్యవి? అను నీ ప్రశ్నములకు సమాధాన మేమో విచారింతము -

కొందఱీ విశ్వమునకు ఒక బ్రహ్మతత్త్వము మూలమందురు. మఱి కొందఱు 'మేటర్' ఒక్కటే యందురు. ఇంక కొందఱు బ్రహ్మము, జీవుడు అను రెండు తత్త్వములే మూల మందురు. వైదికులు మాత్రము ఈశ్వరుడు, జీవులు, ప్రకృతి అను మూడు పదార్థములు ఈ విశ్వమునకు మూలమందురు.

'సర్వం ఖల్విదం బ్రహ్మ నేహ నానాస్తి కించన' ఈ విశ్వమునకు మూలపదార్థము బ్రహ్మమే - మఱియొండులేదు అని శాంకర సంప్రదా యకులు చెప్పుదురు. ఆ బ్రహ్మతత్త్వమునకు లక్షణమేమన 'సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ' సత్యము, జ్ఞానము అనంతము దాని లక్షణమని చెప్పుదురు. సత్తా (ఉనికి) జ్ఞానము, అనంతత్వము - అంతము నాశము లేకుండుట బ్రహ్మతత్త్వమునకు లక్షణమని వారిభావము. అటులయిన మన యింద్రియములకు గోచరమగు నీజడప్రపంచమేమి? అని యడిగినపుడు వారు "ఈ జడప్రపంచము కనబడుచున్నదే కాని వాస్తవమున నియ్యదిలేదు. ఇది మిథ్య - అసత్యము - భ్రాంతి మాత్రమే" యని చెప్పుదురు. కాని, ఉండి దృగ్గోచర మగుచున్న ప్రపం చము మిథ్య - భ్రాంతి - లేకయే యున్నట్లెట్లు కనబడునని ప్రశ్నించిన పుడు మిథ్యావాదు లిట్లందురు. చూడుడు - స్వప్నములో లేనివస్తువులు కూడ ఉన్నట్లు కనబడుట లేదా? అట్లే యీ ప్రపంచము లేకయే యున్నట్లు కనబడునందురు. అది యెట్లన - స్వప్నములో - కలలో - మనము ఏనుగులను, ఒంటెలను, సముద్రములను, నదులను, పర్వత ములను చూచుట' లేదా? మనకు కలలు మన శరీరములోనే కదా

వచ్చును? అట్టియెడ మన శరీరములో ఏనుగు పర్వతము మున్నగు పదార్థములు ఉండి కనబడుచున్నవా? మన శరీరములో నెట్లుండగలవు? కాబట్టి అవి యట లేకయే మనకు ఉన్నట్లు కనబడుచున్నవి కదా? అట్లే యీ ప్రపంచము కూడ నున్నట్లు మనకు దృగ్గోచరమగుచున్నను అది వాస్తవమున లేకయే యట్లు కనబడుచున్నది అందురు. ఈ మాటలు సాధారణ మానవునకు అనగా స్వప్నస్వరూపమేమో తెలియని వానికి వాస్తవములనియే తోచును. అతడట్లే నమ్మును. కనబడు చున్న ప్రపంచము లేదు - మిథ్యయే కనబడని బ్రహ్మతత్త్వము సత్యమని నమ్మును - విశ్వసించును. కాని బుద్ధిమంతుల కిది సమ్మతము కాదు. విశ్వసింపదగినది కాదు. కారణ మేమందురేని, పాఠకులిట కొంచెము ఆలోచింతురుగాక ! మనకు కల యందు మన శరీరమున గనబడు పర్వతాదులు మన శరీరములో ఆ సమయమున లేనిమాట వాస్తవమే. ఉన్నట్లు కనబడుటయు నిజమే. కాని ఆ పర్వతాదులు మనలో నపుడు లేకున్నను ఈ ప్రపంచములో నుండునా? ఉండవా? ఉండును. అవి ప్రపంచములో లేనివస్తువులని యెవ్వరు నంగీకరింపరు. మనకు కలుగు స్వప్నము-కల-యేమిటి? దాని స్వరూప స్వభావము లేమి? అని ఆలో చింపుడు. మనము జాగ్రదవస్థలో నున్నపుడు మన చక్షురాది యింద్రి యములతో బయట ప్రపంచములో నున్న పర్వతాదులతో సంబంధము - సంయోగము - కలిగినపుడు ఆ పర్వతాదుల జ్ఞానము మనకు కలుగును. ఆ జ్ఞానమువలన మన మనస్సులో ఆ పర్వతాదులకు సంబంధించిన సంస్కారములను కలిగించు జ్ఞానము కలుగును. అట్టి సంస్కారములు జాగ్రదవస్థలో మనము చూచి విని తెలిసికొనిన వస్తువులకు సంబం ధించినవి యెన్నియో సూక్ష్మరూపమున నుండును. ఆ సంస్కారముల వలననే యీ వస్తువులు మనయెదుట లేనపుడు కూడ వానిని స్మరి యింతుము - జ్ఞాపకము చేసికొందుము. దీనినే మనము స్మృతి - స్మరణము - జ్ఞాపకము అందుము. 'సంస్కార జన్యం జ్ఞానం స్మృతిః' 'సంస్కారము వలన కలుగు జ్ఞానము స్మృతి యని పదార్థవిజ్ఞానము కలవారు చెప్పుదురు. సినిమాహాలులో కూర్చుండి తెరపై మనుజులు ఆడుట పాడుట పలువిధకార్యములొనర్చుట కనులారచూతుము. వాస్త వమున ఆ తెరపై మనుజు లాసమయమున నుందురా? ఉండరు కాని

మనము చూతుము. సినిమా తెరపై మనము చూచు ఆటయంతయు బయట మనుజులచే నాడించి ఫిల్ములో ఆయాటనంతటిని సూక్ష్మరూపమున ఫోటోతీసి మరల దానిని ప్రకాశ సహాయముతో తెరపై మనకు చూపింతురు. అట్లే జాగ్రదవస్థలో మనము చూచిన పర్వతాదులు సంస్కారములు సూక్ష్మరూపమున మన మనస్సులలో నుండును. కలత నిద్రలో మనస్సులోనున్న ఆ సంస్కారములనే మనస్సుద్వారా తెలిసికొందుము. అదియే కల-స్వప్నము. మనలో ఆ సమయమున పర్వతాదులు లేకున్నను వాని సంస్కారములుండును. ఆ సంస్కారములు లోకమున వాస్తవముగనున్న వస్తువులకు సంబంధించినవే కాని లేనివస్తువులవి కావు. కావున స్వప్న దృష్టాంతముతో లేనివస్తువులు కలలో కనబడుచున్నట్లు లేని ప్రపంచమున్నట్లు కనబడుచున్నదని చెప్పుమాటలు మిథ్య - అసత్యములగును. కాని, ప్రపంచమెన్నడు మిథ్యకాదు - అసత్యము కాదు. కావున ప్రపంచమను నొకవస్తువు లేనేలేదు. బ్రహ్మమొక్కటియే వాస్తవము. దానికి మఱియొండు వస్తువు ఈ ప్రపంచమునకు మూలముకాదు అనుట సరికాదు.

బ్రహ్మమే ప్రపంచముగా మాఱి ప్రపంచముగా నిట్లు కనబడుచున్నది. కావున బ్రహ్మము తక్క మఱియొకటిలేదని మఱియొక విధముగ సమాధానము చెప్ప కేవలబ్రహ్మవాదులు ప్రయత్నింతురు. అదియును సరికాదు. కారణమేమన - బ్రహ్మమే ప్రపంచముగా మాఱి యిట్లు కనబడుననుట యుక్తి యుక్తము - హేతుబద్ధముకాదు. కారణమేమన బ్రహ్మమే ప్రపంచముగా మాఱిన ప్రపంచమునకు బ్రహ్మము ఉపాదాన కారణమగును. ఏది మఱియొక రూపమున పరిణమించునో ఆపరిణత వస్తువునకది ఉపాదాన కారణమగును. ఉదాహరణము:- మట్టి కుండగా మాఱును. ఆ కుండకు మట్టి ఉపాదాన కారణమగును.

పాఠకులిట యొకింత కార్యకారణములను గుఱించి తెలిసికొనుట యావశ్యకము. లోకమున మనము చూచువస్తువులన్నియు దార్శనికుల భాషలో కార్యములనబడును. కార్యములనగా పుట్టి నశించునవి యని యర్థము. లోకమున మనము చూచువస్తువులన్నియు పుట్టి నశించుట చూచుచున్నాము. అందువలన నివియన్నియు కార్యములనబడును. ఇట్టి కార్య వస్తువులకు మూడు కారణములుండును.

1) ఉపాదాన కారణము 2) అసాధారణ కారణము 3) నిమిత్త కారణము, వస్త్రమొకకార్యము. దానికి ఉపాదాన కారణము తంతువులు - దారములు. వానికలయిక అసాధారణ కారణము. ఆ తంతువులను కలిపి వానిని వస్త్రముగా మార్చు వ్యక్తి (సాలెవాడు) నిమిత్త కారణము. అతడుపయోగించు మగ్గపు సామానులు అన్నియు నిమిత్త కారణములో నేచేరును. ఈ కారణముల లక్షణములు స్థూలముగా - మోటుగా - తెలిసికొన దలచిన నిట్లు తెలిసికొనవచ్చును. ఏది - వస్తువు - కార్యముగామాఱునో యది ఉపాదానకారణము. ఉపాదానకారణముల కలయిక సంయోగము - అసాధారణకారణము. మిగిలినవన్నియు నిమిత్త కారణము. ఉపాదాన - అసాధారణ కారణములకు భిన్నమైన కారణ నిమిత్త కారణములు వాని లక్షణములు - ప్రస్తుతము వస్త్రము కార్యము. దారములు ఉపాదానకారణము (అవియే వస్త్రముగా మాఱును) ఆ దారముల కలయిక - సంయోగము వస్త్రమున కసాధారణ కారణము. (యదనంతరం కార్యముత్పద్యతే తదసాధారణ కారణమ్) దేనియనంతరము కార్యముత్పన్నమగునోయది యసాధారణ కారణము. దారముల సంయోగానంతరము వస్త్రము ఏర్పడుచున్నది. కావున తంతు సంయోగానంతరము వస్త్రము ఏర్పడుచున్నది. కావున తంతు సంయోగము అసాధారణ కారణమగును. మిగిలిన సాలెవాడు మగ్గపు సామానులు అన్నియు నిమిత్త కారణములు. ఈ విధముగ కార్యకారణముల లక్షణముల నెఱిగినమీద మనము గమనింపవలసిన విషయము మఱియొకటి యున్నది. అది మిక్కిలి ముఖ్యవిషయము కూడ. అది యెద్దియన - ఉపాదాన కారణములోని గుణములే కార్యమున చూడనగును. ఉపాదాన కారణమైన దారములు తెల్లనివైన వస్త్రము - కార్యము తెల్లనిదేయగును. దారములు నలుపైన వస్త్రము నలుపగును. దారము లనేకవర్ణములు కలవైన వస్త్రము అనేక వర్ణములు కలదియగును. ఇట్లు ఉపాదాన కారణగుణములు కార్యమున నుండుననుట నిక్కువము. ఇక మనము చూచు ఈ ప్రపంచము బ్రహ్మము యొక్క పరిణామమే యగునెడల కుండకుమట్టివలె వస్త్రములకు దారములవలె ప్రపంచమునకు బ్రహ్మము ఉపపాదాన కారణము, ప్రపంచము కార్యము అగును. అట్టియెడ బ్రహ్మము ఉపాదాన కారణమైనందున ఆ బ్రహ్మమునందలి జ్ఞానాదిగుణములు ప్రపంచమున నుండవలెను. బ్రహ్మము జ్ఞానము కావున ప్రపంచమునగల ప్రతివస్తువు జ్ఞానమైయుండవలయును. బ్రహ్మము నిత్యసత్యము కావున ప్రపంచప

దార్థములన్నియు నిత్యసత్యములు కావలయును. బ్రహ్మము అనంతము అనగా నాశములేనిది కావున ప్రపంచపదార్థములు నాశములేనివి కావల యును. ఇందులకు భిన్నముగా ప్రపంచ పదార్థములను జడములు - జ్ఞానరహితములుగా అనిత్యములుగా, నాశవంతములుగా జూచుచున్నాము. కావున బ్రహ్మమే ప్రపంచముగా మాఱినది. వేఱొండు కాదనుట యస త్యము మిథ్యావాదమగుచున్నది.

మఱియు బ్రహ్మము ప్రపంచముగా మాఱినచో బ్రహ్మమునందు వికారము కలుగవలయును. అప్పుడు బ్రహ్మము నిర్వికారి కాక వికారి యగుచున్నది. మాఱుట అనగా నాశము - నశించుట యని అర్థము. కావున బ్రహ్మము మాఱినదనిన నది నశించినదని యర్థమగును. అది నిత్యసత్యమెట్లుకాగలదు ? కావున బ్రహ్మపరిణామమే ప్రంచమనుట యేవి ధముగను చెల్లదు. ఇట్లే కేవల బ్రహ్మవాదులేయే యుదాహరణములతో తమ సిద్ధాంతమును సిద్ధపఱుప యత్నింతురో యా ఉదాహరణములన్నియు విషమములేకాని సరియైనవి కానేకావు.

బ్రహ్మము ఉనికిలేని ప్రపంచమును పుట్టించునందురా? అదియును తర్కసిద్ధము కాదు. పుట్టుట యనగా ఉన్నవస్తువు మఱియొకటిగా మాఱుటయగును. లేక సూక్ష్మముగా నున్న పదార్థము స్థూలమగుటయే కాని లేనివస్తువు - ఉనికి కలది యగుట కాదు. బ్రహ్మము లేనివస్తువు నెట్లు పుట్టించును?

"నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః
ఉభయోరపి దృష్టో౽న్త స్త్వనయోస్తత్త్వ దర్శిభిః" భ.గీత.

అనగా లేనివస్తువు పుట్టదు - అసత్తునకు భావములేదు. ఉన్నవ స్తువు లేకుండపోదు. ఉనికి కలిగినదానికి అభావమెన్నడు కలుగదు. ఇది తత్త్వజ్ఞుల నిశ్చిత సిద్ధాంతము.

కాబట్టి బ్రహ్మము ఉనికి - సత్త - లేని ప్రపంచమును పుట్టించును - సత్త - ఉనికి కలదానినిగ చేయుననుట తత్త్వజ్ఞుల సిద్ధాంతమునకు విరుద్ధమగును.

బ్రహ్మము తక్క మఱియొందు పదార్థము లేకున్న ప్రపంచమేకాక

బీ ప్రపంచమున జ్ఞానేచ్ఛాది గుణములుగల చేతన పదార్థములు జీవ నామకము లున్నవికదా? అవి యెట నుండి వచ్చినవని బ్రహ్మవాదులను ప్రశ్నింతుమేని జీవులు కూడ బ్రహ్మమే (జీవో బ్రహ్మైవ నాపరః) మఱి యొందు వేఱు పదార్థము కాదందురు. ఇదియు వారి మిథ్యావాదమే కాని వాస్తవము కాదు.

ఏలయన :- జీవుడు బ్రహ్మమే కాని వేఱుకానిచో బ్రహ్మ సర్వజ్ఞ ముకదా జీవుడు సర్వజ్ఞుడేలకాడు? అను ప్రశ్నకు వారు జవాబు చెప్పవలసి యుందురు. బ్రహ్మము అవిద్యావచ్ఛిన్నమై అల్పజ్ఞుడైనట్లు సమాధా నముచెప్పుదురేని బ్రహ్మమవిద్యా వచ్ఛిన్నమైనదనిన అర్థమేమి? అవి ద్యావచ్ఛిన్నమన అవిద్యతో కూడుకొనుట - అవిద్యచే అవరింపబడుట యందురేని, ఈ యవిద్యయన నేమి? అది యెటనుండి వచ్చినది? బ్రహ్మము కంటె అది భిన్నమా? బ్రహ్మమేనా? అవిద్య బ్రహ్మము కంటె భిన్నమైనయెడల దానికి స్వతంత్రత ఉన్నదా? లేదా? అవిద్యకు స్వతంత్ర సత్త ఉన్నచో బ్రహ్మమొకటి, అవిద్య యొకటి యగును. అప్పుడు రెండుపదార్థముల నంగీకరింపవలసి వచ్చును. అంగీకరించినచో కేవల బ్రహ్మవాదము ఖండిత మగును. అవిద్య బ్రహ్మముకంటె భిన్నముకాదు. దానికి స్వతంత్రసత్త - ఉనికిలేదనిన బ్రహ్మము బ్రహ్మము నావరించుటయన నర్థమేమి? ఎవడైన తన భుజస్కంధముపై తానే యెక్కగలుగునా? ఒక క్షణము బ్రహ్మమును బ్రహ్మమే అవరించినదని యంగీకరించినను అట్టి ఆవరణముచే బ్రహ్మ మల్పజ్ఞ మెట్లగును? ఐనచో సర్వజ్ఞము అల్పజ్ఞమునెట్లగును? కాబట్టి బ్రహ్మము అవిద్యా వచ్ఛిన్నమై - అల్పజ్ఞమై - జీవుడనబడును అనుట సముచితముకాదని సిద్ధమగుచున్నది.

జీవుడన నది బ్రహ్మముకంటె భిన్నముకాదు. చిదాభాసమే జీవు డని మఱియొకవిధముగా బ్రహ్మైకత్వము సాధింప బ్రయత్నింతురు. అదియు హేతుబద్ధము కాదు. ఏలయన చిదాభాసమననేమి? చిత్ అనగా బ్రహ్మము. చిదాభాసమనగా బ్రహ్మాభాసమే. వేఱేమియు కాదు. ఇట అభాసమన ప్రతిబింబము. కావున చిదాభాసమనగా బ్రహ్మముయొక్క ప్రతిబింబమగుచున్నది. అటులయిన బ్రహ్మముయొక్క ప్రతిబింబము జీవుడని అభిప్రాయము. ప్రతిబింబము బింబమైన బ్రహ్మము కంటె

భిన్నముకాదు కావున బ్రహ్మమే జీవుడని బ్రహ్మవాదుల యభిప్రాయము. కాని ఒకే వస్తువునందు బింబ ప్రతిబింబభావమెట్లుకలుగును? లోకమున అద్దమునందు అద్దమున కెదురుగా నున్నవస్తువుల ప్రతిబింబము లేర్పడుట మనమెఱుగుదుము. అద్దము వంటి మఱియొకవస్తువు మనయెదుట నున్నపుడు మన ప్రతిబింబము అద్దమున నేర్పడును. ఆ యద్దము మనకంటె భిన్నముగా లేకున్న ప్రతిబింబముకలుగదు. అట్లే బ్రహ్మవాదుల దృష్టిలో బ్రహ్మముతక్క వేఱొక పదార్థము లేదందురు. అట్టియెడ బ్రహ్మమునకు ప్రతిబింబమెట్లు కలుగును? చిదాభాసమనగా బ్రహ్మ ప్రతిబింబము కదా? బ్రహ్మము తనలోతాను ప్రతిబింబింపజాలదు కదా? అని ప్రశ్నించిన బ్రహ్మము అంతఃకరణమున ప్రతిబింబించునందురు. అప్పుడు అంతఃకరణమను నదియేమిటి? ఇది యొక పదార్థమా? కాదా? పదార్థమేయైన నది బ్రహ్మముకంటె భిన్నమా? కాదా? భిన్నమందురేని బ్రహ్మైకత్వవాదము ఖండితమగును. అసత్యమగును. అంతఃకరణము పదార్థమే కాదు. దానికి స్వతంత్ర సత్త - ఉనికి లేదందురేని - అంతఃకరణము అభావమగును. అభావమున బ్రహ్మము ప్రతిబింబించుటెట్లు? రెండు వస్తువులు లేనినాడు బింబ ప్రతిబింబ భావమేర్పడజాలదనుట లోకసిద్ధ విషయము.

మఱియు ప్రతిబింబించు పదార్థము, దేనియందు ప్రతిబింబించునో ఆ రెండు వస్తువులు పరిమితములై ఆకారము కలిగియుండ వలయును. అంతేకాక ప్రతిబింబించువస్తువు దేనియందు ప్రతిబింబించునో దానికంటెభిన్నమై దానికి దూరముగా నుండవలయును. అప్పుడే దానికి ప్రతిబింబమేర్పడును. అద్దమునకు ఎదురుగా మనము కొంతదూరములో నిలబడినపుడే మన ప్రతిబింబము అద్దమున నేర్పడును. మనకు ఆకారమున్నది. అద్దమునకు ఆకారమున్నది. అద్దములో ఆకారము లేని వాయువునకు ప్రతిబింబమేర్పడదుకదా? అద్దమున కెదురుగా వాయువు ఉండును. కాని ప్రతిబింబము నందేర్పడునా? ఏర్పడదు. అట్లే ప్రస్తుతమున బ్రహ్మము అంతఃకరణమున ప్రతిబింబింపవలయుననిన బ్రహ్మమునకు అంతఃకరణమునకు రెంటికిని ఆకారము లుండవలయును. అవి యొకదానికి మఱియొకటి యెదురెదురుగా దూరమున నుండవలయును. అప్పుడే బ్రహ్మము అంతఃకరణమున ప్రతిబింబించి జీవనామముతో వ్యవహరింపదగును. కాని, బ్రహ్మము వ్యాపకతత్త్వము. దానికి ఆకారములేదు.

ఇక అంతఃకరణము బ్రహ్మముకంటె భిన్నమై యునికిగల వస్తువుకాదు. అందువలన దానికి అకారమెటనుండి వచ్చును. ఇట్లు అకారములేని వ్యాపకవస్తువు అకారములేని అంతఃకరణమున నెట్లు ప్రతిబింబించును? మఱియు వ్యాపకవస్తువైన బ్రహ్మము అంతఃకరణము కంటె వేఱుగా దూరమున నెట్లుండును? కావున బ్రహ్మము యొక్క ప్రతిబింబము (చిదాభాసము) జీవుడనుట మిథ్యాప్రలాప మన వలసి వచ్చును.

ఇంతటితో నాగక కొందఱు కేవల బ్రహ్మవాదులు అకాశము వ్యాపకమై నిరాకారమయ్యు నీటిలో ప్రతిబింబించుట లేదా? అని యందురేని, ఇదియు వారిభ్రమ మాత్రమే. ఈ యుదాహరణమున అకాశము వ్యాపకము (తక్కిన పృథివ్యాది భూతములకంటె) నిరాకారమునుట సత్యమే. కాని నీరు మాత్రము సాకారము పరిమితమును. అయినను అఖాశము నీటిలో ఎన్నడు ప్రతిబింబించదు. నీటిలో మేఘముల ప్రతిబింబములు కనిపించును. అకాశమునకు ప్రతిబింబమెక్కడిది? నీలి రంగుగల అకాశములోరంగు ఎక్కడినుండి వచ్చును. అకాశములో శబ్దగుణముండును కాని రంగు ఎక్కడిది? నీటిలో కనబడు నీలరంగు అకాశమునకు సంబంధించినది కాదని బుద్ధిమంతు లెఱుగుదురు. అది అకాశమున నుండు భూజలాదుల యణువులకు సంబంధించినదే కాని అకాశమునకు రంగు లేదని తెలిసికొనవలయును. కావున అకాశము నీటిలోవలె బ్రహ్మము అంతఃకరణమున ప్రతిబింబించుననుట పచ్చి అబద్ధము. అందువలన బ్రహ్మమే జీవుడు వేఱొండు కాదనుటయు కల్లయే. ఈ విశ్వమునకు బ్రహ్మమొక్కటియే మూల పదార్థమనిన ప్రపంచసమస్య పరిష్కరింప వీలుకాదనుట స్పష్టము. కావున కేవల బ్రహ్మవాదము అశాస్త్రీయము, అయౌక్తికము. బుద్ధిసంగతము కాదనుట నిశ్చితము. ఇట్లే క్రైస్తవులు యెహోవాప్రభువు. మహమ్మదీయులు ఖుదా తప్ప మఱియొండు మూలపదార్థము లేదని యంగీకరించుటయు సరికాదని తెలియవలయును. వారు దేవుడొక్కడే యుండి లేని జీవులను ప్రపంచమును బుట్టించి నట్లంగీకరింతురు. ఈ వాదముకూడ విజ్ఞాన విరుద్ధమని యెఱుంగవలయును.

ఈ యాధునిక యుగమున కొందఱు భౌతికవాదులు (మెటీరియలి

స్టులు) మూలదార్థము మేటర్ (Mator) తప్ప మఱియొందు లేదందురు. అదియును సరియైన వాదము కాదు. కారణమేమన మేటర్ తక్క మఱియొందు లేనపుడు దాని లక్షణమేమి? అది జడమా? జ్ఞానరహిత పదార్థమా ? లేక చేతనమా? జ్ఞానసహితవస్తువా? నిర్ణయించి చెప్పవలసియున్నది. జ్ఞానరహిత జడపదార్థమందురేని జ్ఞానేచ్ఛాది గుణములుగల లోకమున గనబడు చేతనపదార్థ మెటనుండివచ్చినది? జ్ఞానము లేని మేటర్ మార్పులుచెంది జ్ఞానవంతమగునా? అందులకు ఉదాహరణమేమి? జ్ఞానములేని పదార్థము తనకుతానే మార్పు చెందగలదా? అందునను నియమబద్ధముగా మార్పు చెందగలదా? కలదందురేని ఉదాహరణ మేమి? నేడు సైన్సు చదువుకున్న విద్యార్థి యేవో రెండు గ్యాసులు ఎంతో నియమబద్ధముగా కొలత ప్రకారము కలిపినగాని యొకింత జలమేర్పడకున్నది. ఒకింత జలము ట్యూబులో నేర్పఱచుటకు తనకున్న జ్ఞానమునెంతో జాగ్రత్తగా జ్ఞానము కలిగినవ్యక్తి యుపయోగించినప్పుడే యేర్పడుచున్నది. అట్టియెడ విశ్వాంతరాళమున సూక్ష్మరూపమున నుండు జలమును, నదీసముద్రాదులలో నుండు అపారజలమును ఏసైంటిస్టు ఎక్కడ నేప్రయోగశాల (లేబరేటరీ)లో కూర్చుండి నిర్మించుచున్నాడు? అతడు జ్ఞానవంతుడా? కాదా? లేక యీ జడప్రకృతియే (మ్యాటరే) నిర్మించుచున్నదా? దీనికి సమాధానమేమి? ఇంతవఱకు ఏసైంటిస్టైనా జ్ఞానేచ్ఛాదులను రాసాయనిక సమ్మేళనముతో సృష్టింపగలిగినాడా? లేదు. కావున జ్ఞానేచ్ఛా ప్రయత్న సుఖదుఃఖాదులుగల జీవులు మ్యాటర్ కంటె భిన్నవస్తువులుగా నంగీకరింపక తప్పదు. అట్లే యీ మ్యాటర్‌ను పాంచభౌతిక విశ్వముగా మార్చగల యనంతశక్తి జ్ఞానాదులుగల వ్యాపక తత్త్వము ఈశ్వరుడనుదానిని అంగీకరింపక తప్పదు. జీవుడు ఒక్కడు కాని, పలువురు జీవులు కలిసికాని మ్యాటర్‌ను దృశ్యమానమగు విశ్వముగా మార్చగలరని యేవైజ్ఞానికుడైనను చెప్పగలడా? చెప్పజాలడు, కావున మ్యాటర్ - మూల ప్రకృతితో బాటు జీవేశ్వరులను వేర్వేఱు తత్త్వములుగా నంగీకరింపక తప్పదని సిద్ధమగుచున్నది.

అందువలననే వేద మీవిశ్వమునకు మూలపదార్థములు ప్రకృతి, జీవులు, ఈశ్వరుడు అని మూడుతత్త్వముల నంగీకరించుచున్నది. ఈ మూడింటిలో నే యొక్కటి లేకున్నను ఈ విశ్వమిట్లు ఏర్పడుటకు వీలు లేదని వేదసిద్ధాంతము. ఈ క్రింది ఋగ్వేదమంత్ర మేమనుచున్నదో గమనింపుడు.

"ద్వా సువర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరి షస్వజాతే,
తయోరన్యః పిప్పలం స్వాద్వ త్త్యనశ్నన్నన్యో భి చాకశీతి" యజు.

ఈ మంత్రము విశ్వమునగల మూలపదార్థములను మూడింటిని ఆలంకారికముగా వర్ణించుచున్నది.

ద్వా=రెండు, సుపర్ణా=మంచి ఱెక్కలు గల పక్షులు, సయుజా=కల సియుండునవి, సఖాయా=కొన్ని సమానగుణములు కలవి, (మిత్రముల వంటివి) సమానం వృక్షం=ఒక వృక్షమును, పరిషస్వజాతే=కౌగిలించు కొని యున్నవి, తయోరన్యః=రెండింటిలో నొకటి, పిప్పలం=చెట్టునపండిన పండును, స్వాద్వత్తి=రుచిని అస్వాదించుచు తినుచున్నది, అన్యః=మఱి యొకపక్షి, అనశ్నన్=తినక, అభిచాకశీతి=అంతట ప్రకాశించుచున్నది, ఇది మంత్రగత పదములకర్థము.

ఈ మంత్రమున వర్ణింపబడిన వృక్షము ప్రకృతితో నేర్పడిన ప్రపం చము. దానిలో నుండు రెండు పక్షులలో నొకటి జీవుడు, రెండవది ఈశ్వరుడునని తెలియదగును. ఇట ప్రపంచము వృక్షముతో పోల్చబడి నది. (వృశ్చ్యతే ఇతివృక్షః) వృక్షము వ్రయ్యలు - ఖండఖండములుగ విభజింపదగినది వృక్షపదార్థము. అనగా ఈ ప్రపంచము ప్రకృతి అన బడు పరమాణువుల సంయోగముచే నేర్పఅపబడినది. కావున నిది యొక కార్యపదార్థము. అది ఖండశః - ముక్కలుగా చేయబడదగినది. పరమా ణురూపమున నీ ప్రపంచము విడదీయదగియున్నదని తెలియనగును. ఆ పరమాణువులే యీజడజగత్తునకు మూల పదార్థములే - అవియే ప్రకృతి యనబడును. ఆ ప్రకృతినే ఉపాదాన కారణముగా గ్రహించి యీశ్వరు డీ స్థూలప్రపంచమును రచించుచున్నాడు.

రెండు పక్షులు ప్రాణులగుటచే అవి రెండు చేతనపదార్థములను

సూచించుచున్నవి. ఆ రెండు చేతనపదార్థములలో నొకటి జీవుడు రెండవది ఈశ్వరుడు ననిభావము. జీవుడు ఈ ప్రపంచమున నుండి యనేక శుభాశుభకర్మము లాచరించును. ఆ కర్మల ఫలములను సుఖదుఃఖరూపమున ననుభవించు చుండును. ఇక యీశ్వరుడు జీవుడొనర్చు కర్మలను చూచుచుండును. అతడు వ్యాపకతత్త్వము. అందువలననే యీశ్వరుడు అంతట విడివిడిగా నుండు పరమాణువులను ఒకదానితో మఱియొక్కటి చేర్చి క్రమముగా స్థూలజగత్తును నిర్మించును. ఈశ్వరుడెక్కడనో యొక స్థలమున నుండు వ్యక్తియగుచో నట్లు చేయజాలడు. కావున నతడంతట ప్రపంచములో నున్న జీవులొనర్చుకర్మలను సాక్షిగ చూచుచుండును. అంతేకాక యతడు ఆ కర్మలకు ఫలములను తగినవిధముగా జీవులచే ననుభవింప జేయుచుండును.

ఈ విషయమునే ఉపనిషత్తులు కూడ వివరించుచున్నవి. శ్వేతాశ్వతర ఉపనిషత్తు ఈ విషయము నిట్లు వివరించుచున్నది.

"అజా మేకాం లోహిత శుక్లకృష్ణాం బహ్వీః ప్రజాః సృజమానాం సమానాః,
అజో హ్యేకో జుషమాణో నుశేతే, జహాత్యేనాం భుక్తభోగ్యా మజో న్యః"

"సమానాః బహ్వీః ప్రజాః సృజమానాం=తనకు సమానమైన బహు సంతానమును సృజించు - కనునట్టిదియు, లోహిత శుక్లకృష్ణాం=ఎఱుపు, తెలుపు, నలుపురంగులుగల, ఏకాం అజాం=ఒక్క ఆడుమేకను, ఏకః అజః=ఒక మగమేక, జుషమాణః=ఆడుమేకను అంటిపెట్టుకొని యంతటనున్నది. అన్యః అజః=మఱియొక మగమేక, భుక్తభోగ్యాం=అనుభవించిన భోగములుగల దానిని, జహాతి=విడిచి పెట్టుచున్నది. ఇది యుపనిషత్తులోని పదములకర్థము.

ఈ యుపనిషద్వాక్యమునందు ఒక లోహిత శుక్లకృష్ణ రంగులుగల యొక ఆడుమేక (అజా) యున్నదనియు, అది తనవంటి (తనకు సమానమైన) అనేక సంతానమును కనునని వర్ణింపబడినది. తదుపరి మఱి రెండుమేకలు (అజః) న్నవని యు. అందొకటి ఆడుమేక అంటిపెట్టుకొని యంతట నుండు ననియు, రెండవమేక ఆడుమేకను అనుభవించి అనుభవము పూర్తియైనపిదప దానిని విడిచిపెట్టుననియు వర్ణించినది.

ఇందు అడుమేక ప్రకృతియని రెండు మగమేకలలో నొకటి ఈశ్వ రుడనియు, రెండవది జీవుడనియు ఉపనిషదభిప్రాయము.

ప్రకృతి సత్త్వరజస్తమస్సులు అను మూడు స్వభావములు కలిగియుం డును. "సత్త్వరజస్తమసాం సామ్యావస్థా ప్రకృతిః" 'సత్త్వరజస్తమస్సుల సామ్యావస్థయే ప్రకృతి' యని సాంఖ్యశాస్త్రము నిర్వచించినది. ప్రపం చములోని ప్రకాశించు పదార్థములు అగ్ని మున్నగునవన్నియు ప్రకృతిలోని సత్త్వస్వభావమును తెలుపును (సత్త్వం ప్రకాశకమ్). ప్రపంచము లోని క్రియలన్నియు ప్రకృతిలోని రజోగుణస్వభావము. (రజోరా గాత్మకం విద్ధి). ప్రపంచములోని స్తబ్ధత - తమస్సు, అవరణము ప్రకృతిలోని తమోగుణ స్వభావమని తెలియనగును. ప్రకృతి నుండి యేర్పడు స్థూలపదార్థములలో అన్నింటిలోను పైమూడు స్వభావములు కనబడుచునేయున్నవి. అందువలననే యుపనిషత్తులో మూడురంగులుగల అడుమేక ప్రకృతితో పోల్చబడినది. ఒక మగమేక జీవుని సూచించునని చెప్పియున్నాను. అమేక అడుమేక ననుభవించి భోగము పూర్తియైనమీ దట దానిని విడిచి పెట్టుననియు ఉపనిషత్తు చెప్పినది. జీవుడు లోక మున అనేక శుభాశుభకర్మలాచరించి, ఆ కర్మలఫలములను సుఖదుఃఖ రూపమున ననుభవించుట చూచుచునే యున్నాము. జీవుడు కర్మఫల ముల ననుభవింపవలసినంతకాలము ఆయాకర్మఫలముల ననుభవించుటకు తగినట్టి నానా విధజన్మలలో నను భవించి చివరకు ఈ మానవజన్మను బొంది తాననుభవింపలసిన ఫలముల నన్నింటిని అనుభవించి, ఫలములను భవింపవలసినవి లేనిస్థితి సంభవింప శరీరమనెడి బంధమునుండి తొలగి పరమేశ్వరునందుస్వస్వరూపమున నుండి ఆనందము ననుభవించును. అనగా జీవుడు ముక్తుడగునని భావము. ఈ స్థితినే ఉపనిషత్తు (అజో హ్యేకోభుక్త భోగ్యాం జహాతి) అని బోధించినది.

మఱియొక మగమేక యేమియు తినక అంతట ప్రకాశించునని ఉప నిషత్తులో చెప్పబడినది. ఈశ్వరుడు ప్రకృతి నుండి యేర్పడిన ప్రపంచము నందంతటను విశ్వకర్త కావున వ్యాపించియుండును. అంతేకాక విశ్వమును మించి యనాద్యనంతుడై యుండును. ఈశ్వరుడు సృష్టి స్థితిలయములు చేయుటయే కాక జీవులొనర్చు కర్మలను సాక్షియై చూచుచు వానికి తగి

నఫలముల నొసంగి జీవులచే ననుభవింపజేయును. ఈ యుపనిషత్తునందు గమనింపదగిన మఱియొక ముఖ్యవిషయమున్నది. ఇందు అలంకారికముగ వర్ణింపబడిన మేకలన్నియు, 'అజా, అజః, అజః' అనుపదములతో స్మరింపబడినవి. సాధారణముగ అజ శబ్దమునకు లౌకిక భాషలో మేకయని అర్థము. ఆ శబ్దము యొక్క వ్యుత్పత్త్యర్థమును గ్రహించినచో (నజాయతే ఇతి అజః-అజా) జన్మలేనిది - జనించనిది అజయనబడును. కాబట్టి జీవేశ్వర ప్రకృతులు అనుమూడు పదార్థములును జన్మరహితములే - జన్మలేనివి కావున నాశముకూడ లేనివగుచున్నవి. అనగా జీవేశ్వరప్రకృతులు మూడును జన్మ వినాశములు - ఆద్యంతములు లేనివై నిత్యసత్యములనబడును. కావుననే యీ మూడు పదార్థములే యీ ప్రపంచమునకు మూల పదార్థములనుట సిద్ధమగుచున్నది. ఇందు ఈశ్వరుడు సృష్టి కర్త. ప్రకృతి యీ విశ్వమునకు ఉపాదాన కారణము. జీవుడు సాధారణ కారణమని తెలిసికొనవలయును. కావున జగత్తునకు మూల పదార్థములు మూడే యగును. ఒకటి కాని, రెండు కాని కావని సుస్పష్టమగుచున్నది. ఇదియే వైదిక త్రైతవాద స్వరూపము. ద్వైతాద్వైత విశిష్టాద్వైత వాదములన్నియు అవైదికములు. యుక్తియుక్తములు కావని యెల్లరెఱుగవలయును. మహర్షి దయానంద సరస్వతీ స్వామి ఈ వైదిక త్రైతవాదమునే విశ్వమున వ్యాపింపజేయుటకు ఆర్యసమాజమును భారతదేశమున స్థాపించియున్నాడు. ఆ సమాజమును హిందూసంస్కరణ సంఘమనియో క్రైస్తవ ముస్లిమ్ విరుద్ధ సంస్థయనియో యెంచుట మిక్కిలి అజ్ఞానము.

ఇతిశమ్

# మనము హిందువులమా ? వైదికులమా ? విశ్వహిందూ పరిషత్తా ? విశ్వవైదిక పరిషత్తా ?

భారతదేశమున ప్రస్తుతము సుమారు ఎనుబది (80) కోట్ల జనులు వసించుచున్నారు. వారెల్లరు హిందువులు, మహమ్మదీయులు, క్రైస్తవులు, జైనులు, పారసీకులు, బౌద్ధులు, సిక్కులు నని వ్యవహరింపబడుచున్నారు. మహమ్మదీయులు, క్రైస్తవులు, బౌద్ధులు, జైనులు అను నీపదములన్నియు వారనుసరించు మతములను సూచించును. లేక ఆయా మత ప్రవక్తల ననుసరించువారినైనను తెలుపును. మహమ్మదు ననుసరించువారు మహమ్మదీయులు, క్రీస్తు ననుసరించువారు క్రైస్తవులు, బుద్ధుని అనుసరించు వారు బౌద్ధులు, జినస్వామి ననుసరించువారు జైనులు అనబడుచున్నారు. పారసీకులు ఈ దేశమువారు కాదు. వారు 'ప్రష్యా' దేశమునుండి వలసివచ్చిన వారు. కావున వారిని పారసీకులందురు. శిష్యపదమునుండి సిక్కుపదము వ్యవహారమునకు వచ్చినది. గురుగోవిందసింగుకు శిష్యులుగా నేర్పడి వారి బోధననుసరించి నడుచుకొనువారు సిక్కులనబడుచున్నారు. ఇక మిగిలినవారు హిందువులనబడుచున్నారు. వీరీదేశమున నధిక సంఖ్యాకులుగానున్నారు. 'మీరేల హిందువులనబడుచున్నారు?' అని వారిని అడిగినచో వారు తగిన సమాధానమీయజాలరు. వారికి నామమెట్లు వచ్చినదో ఎపుడు వచ్చినదో, దాని యర్థమేమో నూటికి తొంబది తొమ్మిదిమందికి తెలియదనియే చెప్పవచ్చును. విద్యాసంస్థలలో పనిచేయు ఇతిహాసాధ్యాపకులు హిందూదేశమున నుండువారు కావున హిందువులనబడుచున్నారని చెప్పనుంకింతురు. కాని యీ దేశమునకు హిందూదేశము అను పేరుకలదా? ఎప్పుడు, ఎట్లు కలిగినది? అని వారినడిగినచో దానికి వారు ప్రథమమున నీ దేశమునకు 'సింధుదేశము'ను పేరు కలద

నియు, పారసీకులిటకు వచ్చినప్పుడు వారు ఈ దేశమును సింధూదేశము అనుటకు బదులు హిందూదేశమని పిలువనారంభించిరనియు అటుపై నీదేశము హిందూదేశమని ప్రసిద్ధికెక్కినదనియు నేమేమో చెప్పయత్నింతురు. వాస్తవమారయ నిదియంతయు కపోలకవిత్వమని తెలియకపోదు. కారణమేమన భారతీయ భాషలలో నెందునను ఈదేశమును సింధుదేశమని పూర్వము వ్యవహరించినట్లే కనిపింపదు. సింధుదేశమని యీదేశమునకు పేరే లేనపుడు పారసీకులు సింధుదేశమును హిందూదేశమని నారనియు నాటినుండియు నీదేశము హిందుదేశమైనదనియు చెప్పుట యెట్లు యుక్తి సంగతమగును. పారసీకులెవరో కొద్దిమంది యెటనుండియోవచ్చి, యీదేశమును హిందూదేశమని నంతమాత్రమున నీదేశవాసులెల్లరు తమదేశపు పురాతననామము నేలవిడిచిపెట్టెదరు? పారసీకులిట రాజ్యము స్థాపించి, రాజశాసనముద్వారా దేశనామమును మార్చినారనుటకును వీలులేదు. వారిట తలదాచుకొన వచ్చినవారేకాని, రాజ్యము నేలినవారు కానే కారు. కావున పారసీకులవలన నీదేశము హిందూదేశమని పిలువబడుట యుక్తిసిద్ధముకాదు. అదియునుకాక పారసీకులు సకారము పలుకలేనివారు కారు. వారిభాషలో 'స' లేకపోలేదు. కావున వారు సింధుదేశమును హిందూదేశమని యేల అందురు? కాగా హిందూదేశమున నుండువారు కావున హిందువులనబడు చున్నారనుట అంగీకార్యము కాదు.

మఱియు దేశమునుబట్టి యిటనుండు వారు హిందువులనబడు నెడల హిందూదేశమున నుండువారు ఎల్లరు హిందువులే యనబడవలయును. దేశమునుబట్టి వచ్చిననామమును దేశవాసులెల్లరు అంగీకరింతురు. ఎవ్వరును తిరస్కరింపరు. రష్యాలో నుండు వారేమతమునకు చెందినవారైనను తమ్ము తాము రష్యనులనియే చెప్పకొందురు. ఇట్లే జపాన్, చైనా, అమెరికా మున్నగు దేశవాసులెల్లరు అయాదేశనామములతో పిలువబడుటకు ఎవ్వరును తిరస్కరింపరు. అట్టియెడ హిందూదేశమున నుండు క్రైస్తవులు, మహమ్మదీయులు, జైనబౌద్ధులు తమ్ము హిందువులని పిలువనేల యంగీకరింపరు? మహమ్మదీయాది మతస్థులు తమ్ముతాము ఇండియనులనియు, భారతీయులనియు నంగీకరింతురు కాని. హిందువులని యొక్కరైనను అంగీకరింపరుకదా? కారణమేమి? దీనింబట్టి 'హిందువు' అనుపదము

హిందూదేశమున నుండి నందున వచ్చినది కాదని స్పష్టపడుచున్నది. అటుపైన హిందువననేమి? ఈపదమున కర్థమేమి?

ఈ హిందువులు తమ మతము, హిందూమతమని చెప్పుకొందురు. హిందూమతమన నర్థమేమి? క్రీస్తుమతము, బుద్ధమతము, అనినట్లు హిందూమతము అని చెప్పవచ్చునా? క్రీస్తు, బుద్ధుడు, మహమ్మదు మున్నగువారు మానవచరిత్రలో పేరు పొందినవ్యక్తులు. వారు ఆయా దేశకాలములలో బోధించిన సిద్ధాంతములే వారిమతములుగా లోకమున ప్రచారమునకు వచ్చినవి. హిందూమతమునకు మూలపురుషుడైన ఈ హిందువెవరు? మానవచరిత్రలో నితనికెటువంటి స్థానము కలదా? ఏ దేశమున నెన్నడు జన్మించినాడు? అతడు బోధించిన సిద్ధాంతములేమి? ఎవరైన నీ ప్రశ్నలకు ఇదమిత్థమిని సమాధానము చెప్పగలరా? ఎవ్వరును చెప్పజాలరు.

కాబట్టి నేడు హిందువులని పిలువబడువారు హిందువులు కారనియు, వారిమతము హిందూమతము కాదనియు నెంచవలసి వచ్చుచున్నది. అటులైన, వీరినామమేమి? వీరేల హిందువులనబడిరి? హిందు పదమేభాషకు చెందినది? దాని యర్థమేమి? అను ప్రశ్నలు పాఠకులకు జనించును. దీనికి నా సమాధానము వినుడు - ఆలోచించుడు. ఎంతవఱకు యుక్తమో నిర్ణయించుడు.

పాఠకులారా! నేడు హిందువులని పిలువబడువారు మహమ్మదీయుల ప్రభుత్వమీదేశమున బాగుగ పాదుకొనకముందు 'ఆర్య' నామముచే పిలువబడుచుండెడివారు. ఈ దేశమునకు అతిప్రాచీన నామము ఆర్యావర్త మని యుండెడిది. తదుపరి భారతదేశమని కీర్తింపబడినది. ఎన్నడు నీదేశము హిందూదేశమని వ్యవహరింపబడినట్లు ఈదేశపు సాహిత్యమునగాననేరము. ఈ దేశమునకు వేదములు మొదలు పురాణముల వఱకు నెంతో గొప్పవాఙ్మయము సంస్కృతమునను, ఇతర భారతీయ భాషలలోను కలదు. కాని, ఇంతటి గొప్ప బహుళ సాహిత్యమునందును ఈ దేశమును హిందూదేశమని కాని ఇక్కడ నివసించువారిని హిందువులని కాని వ్యవహరించుట జూడము. ఏదేశపు నామమైనను, ఆదేశమునకు చెందిన సాహిత్యమున కీర్తింపబడకుండునా? ఇయ్యది

సాధ్యమా? పైనజెప్పినట్లు వైదిక వాఙ్మయమునగాని, యితర లౌకికవా ఙ్మయమునగాని హిందుపదము కనిపింపకుండుట పాఠకులకు వింతగా కనిపింపదా? కావుననే యీ హిందువులు హిందువులుకారు. వీరిమతము హిందూమతము కాదని నాయభిప్రాయము.

ఇక వీరు హిందువులెట్లైరి? అని మీరడిగినచో నాసమాధానమిది. మహమ్మదీయులీదేశము నాక్రమించుకొని, యిక్కడ ఎనిమిది శతాబ్ద ములకాలము శాసనమొనర్చియుండిరని చరిత్ర చెప్పుచున్నది. ఇందు ివాదమునకు తావులేదు. ఔరంగజేబు మున్నగువారి ప్రభుత్వకాల మున నీదేశవాసులను, బలవంతముగా శిఖాసూత్రములను తొలగించి మహమ్మదీయ మతానుయాయులుగా మార్చనారంభించిరి. 'ఇస్లామ్'ను ంగీకరించిన వారు ముస్లిములు - మహమ్మదీయులుగా పరిగణింప డిరి. అట్లంగీకరింపక తమ వేదమతమును అంటిపెట్టుకొని యున్నవా ని 'మీరు హిందువులు' అని మహమ్మదీయులు వ్యవహరింప నారంభిం రి. 'హిందువు' అను నీపదమును 'కాఫిర్' అను అర్థమున వారు పయోగించిరి. 'ఇస్లామ్' మతమున విశ్వాసము లేనివాడని అభిప్రా యము. వాస్తవమున 'హిందు' పదము పారసీకభాషకు సంబంధించినది. భాషకు చెందిన 'శబ్దకోశమున' హిందువు అనగా, కాఫిర్, గులామ్, చోర్, బద్‌మాష్, కాలా అద్‌మీ, డాకూ అను అర్థములు చూడన ను. కాఫిర్=ఇస్లాములో విశ్వాసము లేనివాడు, పాపము చేసినవాడు, లామ్=బానిస, చోర్=దొంగ, బద్‌మాష్=చెడువృత్తికలవాడు, కాలాఅ మీ=నల్లనివాడు, డాకూ=బందిపోటుదొంగ. ఈ యర్థములలో నేవో న్నిటిని పురస్కరించుకొని ఆర్యులను హిందువులని వ్యవహరింపసాగిరి. మహమ్మదీయుల పరిపాలన కాలమున నీ హిందూపదము వైదికులకు లవంతముగా అంటగట్టబడినది. స్వాతంత్ర్యమును కోలుపోయి యనేక తాబ్దములు మహమ్మదీయుల పరిపాలనకు లోబడి యుండుటచే క్రమ ముగా హిందూపదమీదేశమునకు, దేశవాసులకు ప్రసిద్ధ నామముగా పరిణ మించినది. తదుపరి ఇంగ్లీషువారి పరిపాలనలో సుమారు 200ల యేండ్లు ండుటచే హిందూనామమిక్కడివారికి జీర్ణింపజేయబడినది. ఇంతేకాదు ంగ్లీషుపాలన కాలమున నీహిందువులను క్రైస్తవమతమున చేర్చుకొనసా

గిరి. క్రైస్తవులు కాని హిందువులను వారు అన్యులని వ్యవహరించుటయు నేటివఱకు నెల్లరు నెఱిగిన విషయమే. కాబట్టి హిందుపదము దేశ వాచకముకాదు. హిందువుడన మతవిశ్వాసము లేనివాడని యర్థము.

ఇంతటి చరిత్ర ఈ హిందూపదమునకుండగా దానినంతటిని విస్మరించి నేటికిని ఈదేశవాసులు - ఆర్యులు తమ్ముతాము హిందువులని యేల వ్యవహరించుకొనుచున్నారో బోధపడకున్నది. ఇంగ్లీషు పరిపాలనకు లోబడి దాస్యభావము జీర్ణించి యున్నకాలములో - పందొమ్మిదవ శతాబ్దమున గుజరాత్ ప్రాంతమున ఔదీచ్య బ్రాహ్మణవంశమున నుద్భవించి, అదిత్యబ్రహ్మచర్యవ్రత నిష్ఠాగరిష్ఠుడై వేదవేదాంగవిద్యలలో పారంగతుడైన శ్రీమద్దయానందసరస్వతీ స్వామివారు వేదముల కాలవాలమైన భారతభూమిని దాస్యశృంఖలముల నుండి విడిపింపనెంచి క్రీ.శ.1875న ఆర్యసమాజమును బొంబాయిలో స్థాపించియుండెను. ఆమహర్షి హిందూ పదరహస్యమును గుర్తించియే తాను స్థాపించిన సమాజమునకు 'హిందూ సమాజము' అని నామము పెట్టక 'ఆర్యసమాజము'ని నామకరణ మొనర్చియుండెను. ఆమహానుభావుని దూరదర్శిత్వమును గుర్తింపనివ్యక్తులు, అంధవిశ్వాసములకు లోబడినవారు కొందఱు హిందూమహాసభపేరుతో నొకసభ నేర్పఱచి మహర్షి బోధించు ప్రాచీన వైదికమతమును నిరసించుచు తమ్ముతాము హిందువులమని చాటుకొన ప్రారంభించిరి. దయానందమహర్షి. అతనిచే స్థాపింపబడిన ఆర్యసమాజము ఈదేశవాసులలోగల అంధవిశ్వాసములను, మూఢాచారములను, అవైదిక సిద్ధాంతములను ఖండించి సత్యములైన తమ పూర్వమహర్షులు ప్రచారమొనర్చిన వేద సిద్ధాంతములను బోధించుట నోర్వజాలక యజ్ఞానవశమున హిందూమహాసభపేరుతో నెదుర్కొనజొచ్చిరి. ఇది వారియజ్ఞానమనక, యేమనవలెను?

హిందూమహాసభ ప్రారంభమున పంజాబుప్రాంతమున నేర్పడినది. అప్పుడది కేవలము, ఆర్యసమాజమును వ్యతిరేకించుటకే యేర్పడియుండెను. తదుపరి రాజనైతిక పక్షముగా మాఱినది. పండిత మదన మోహనమాలవ్యా, వీరసావర్కార్ మున్నగు గొప్పవ్యక్తుల ప్రాపున నీహిందూమహాసభ రాజనైతిక కార్యకలాపములలో వ్యాపకత సంపాదించినది.

స్వ. శ్రీ పండిత మాలవ్యాగారు ఈ హిందూపదప్రాశస్త్యమును గూర్చి యొకప్పుడు ఆలోచించియుండిరి. వారు దీనిని నిర్వచింప నెంతగానో యత్నించియుండిరి. కాని అందులేని ప్రాశస్త్యము నెట నుండి తేగలరు? శిఖ కలవాడు హిందువా? తిలకము నుంచు కొనువాడు హిందువా? యజ్ఞోపవీతధారి హిందువా? ఇవియన్నియు కలవాడు హిందువా? ఎవడు హిందువు? తిలకధారులలో ఏ తిలకధారి హిందువు? అడ్డబొట్టు నిలువుబొట్టు, చుక్కబొట్టు, బెండకాయబొట్టు, సపాద ఊర్ధ్వత్రిపుండ్రము, విపాద త్రిపుండ్రము. ఇన్ని తిలకములలో నే తిలకము ధరించువాడు హిందువు? ఏ నిర్వచనముచేసినను హిందు వులనబడు వారెల్లరు అనిర్వచనమునకు లోనగుదురా? కారు. ఈమధ్య కొందఱు పండితులు, 'హీనం దూషయతి' హినస్తి దునోతి, అని యేమేమో అర్థములు హిందుపదమునకు చెప్పసాగిరి. ఇయ్యవి యే వ్యాకరణము ననుసరించి చెప్పుదురో వారికే తెలియవలెను. వైయాకర ణులంగీకరింతురా? హీనుని దూషించువాడు హిందువగునెడల మహ మ్మదీయుడు-హీనుని దూషించినచో నతడు హిందువుడేలకాడు? లోకమున హీనుని దూషింపనివాడెవడుండును? ఒకహీనుని మఱియొకహీనుడు కూడ దూషించును. అతడు హిందువుడగునా? ఈయర్థమునగల విశేషమేమియో బోధపడకున్నది. 'హింకృణోతి', 'దునోతి' అనుపదముల లోని అద్యక్షరములతో 'హిందు' పదమేర్పడుననియు నొకరనుచుందురు. అప్పుడు దానియర్థమేమి? అసలు అనర్థదాయకమైన హిందుపదము నంగీకరించుటేల? దానిని సార్థకముచేయుట కిన్నియగచాట్లు పడనేల? హిందుపదమును ప్రేమించువారికే యది యర్థముకావలెను. ఇతరుల కర్థము కాజాలదు. హిందూమహాసభ వారిన్నియగచాట్లు పడుచుండగా నిన్న మొన్న యేర్పడి హిందుపదవాచ్యుల నెల్లరను కాపాడ నేర్పడిన విశ్వహిందూపరిషత్తు కూడ హిందుపదమును గాఢముగా ప్రేమింప బూను కొన్నది. ఎందులకో వీరికి హిందుపదము మీద నింతమక్కువ? ఈ పరిషత్తు తామంగీకరించిన హిందువెవరో వివరింపబూని యెంతతిప్పలు పడినదో వారి ఈ క్రింది వివరణమువలన తెలియనగును.

"భారతీయ ఋషిప్రోక్తాన్ ఇహాముత్రార్థసాధకాన్
యోంగీకరోతి సశ్రద్ధం సత్‌సిద్ధాంతాన్ సనాతనాన్"

"మహాత్మభిర్ ధ్యానశీలైః కాలే కాలే ప్రవర్తితాన్
సంప్రదాయానాద్రియతే యః సర్వాన్ పారమార్థికాన్"

"యత్ర కుత్రాపి జాతోఽ సౌ వాఽస్తుయః కోఽపి జన్మనా
సచ్ఛీలోదారచరితః సోఽత్ర హిందురితి స్మృతః"

'భారతీయ ఋషిప్రోక్తములైన, ఐహికాముష్మిక ప్రయోజనములను సిద్ధింపజేయు సనాతన సత్ సిద్ధాంతములను శ్రద్ధతో నంగీకరించువాడు'.

'ధ్యానశీలురైన మహాత్ములచే భిన్నభిన్న సమయములలో ప్రవర్తింప జేయబడిన పారమార్థిక సంప్రదాయముల నన్నింటిని ఆదరించువాడు'.

'ఎక్కడ బుట్టినను, జన్మతో నెవడైనను, సచ్ఛీలుడు ఉదారచరితుడు ఇట హిందువనబడును'.

(విశ్వహిందూపరిషత్తు-నియమనిబంధనావళి)

ఇయ్యది విశ్వహిందూపరిషత్తు వారి హిందుపదనిర్వచనము. వీరి హిందుపదము బౌద్ధజైన చార్వాకాదులకు గూడ గ్రాహకముగా నెంచుచున్నారు.

బౌద్ధులు, జైనులు, సిక్కులు వేదములను, వేదసిద్ధాంతములను అంగీకరింపరు. ఐనను వారు పరిషత్తుదృష్టిలో హిందువులే యనబడుదురు. ఎక్కడ బుట్టినను, జన్మతో నెవడైనను సచ్ఛీలుడు ఉదారచరితుడు హిందువగునెడల 'క్రీస్తు' హిందువేలకాడు? అతడు సచ్ఛీలుడు కాడనుటకు హేతువేమి? క్రీస్తు ఉదారచరితుడు కాడని యెట్లు చెప్పగలము? ఈలక్షణమునుబట్టి క్రీస్తు హిందువగుచో నతనియనుయాయు లేల హిందువులు కారు? వారిని 'హిందుసంఘము'లో చేర్చుకొనెదరా? చేర్చుకొననినాడు హిందుపదనిర్వచనమున కర్థమేమి? నిర్వచనములోగల లక్షణములన్నియు క్రైస్తవులలో గాని, క్రీస్తులోగాని లేవందురేని బౌద్ధ, జైన, సిక్కులలో మీరు నిర్వచించిన లక్షణములన్నియు నున్నవా? లేనిచో వారెట్లు హిందుపదవాచ్యులగుదురు? స్వ. అంబేదకర్ హిందువైయుండి బౌద్ధమతమునెట్లు స్వీకరించెను? బౌద్ధులు హిందువులే కదా! అతని యను

యాయులెందఱో బౌద్ధులగుచున్నారే ! హిందువులు బౌద్ధులుగామాఱుట హిందువులగుటయేనా? భిన్నమతము నంగీకరించుటయా?

పరిషత్తువారు హిందుపదమునకు చెప్పిన నిర్వచనము నిష్కర్షగా నెవడు హిందువో తెలుపుచున్నట్లు కనిపింపదు. పరిషత్తు వ్యవహారము నుబట్టి చూచిన క్రైస్తవ మహమ్మదీయేతరులెల్లరు హిందువులనిచెప్పిన తేలికగా నర్థమయ్యెడిదేమో. కాని, వారట్లుచెప్పరు. పరిషత్తుదృష్టిలో ఆస్తికులు, నాస్తికులు, విగ్రహారాధకులు, విగ్రహారాధకులు కానివారు, పునర్జన్మనంగీకరించువారు, అంగీకరింపనివారు - జన్మతో కులవ్యవస్థ - నంగీకరించువారు, జన్మతో వర్ణవ్యవస్థ నంగీకరింపనివారు ఎల్లరు హిందువులే యనబడుదురా? లేదా? ఇట్లు ఎన్నివిధముల నాలోచించినను పరిషత్తువారి హిందుపద నిర్వచనమేమో బోధపడకున్నది. కావున నిట్టి చిక్కులతో గూడి సందిగ్ధార్థమును బోధించుహిందుపదమును వీడి, నేడు హిందువులని పిలువబడు వారెల్లరు తమపూర్వుల నామమైన ఆర్యపదముచే పిలువబడుట కంగీకరించుట మిక్కిలి శ్రేయస్కరము కాదా?

హిందువులచే పరమప్రమాణములనియు, స్వతఃప్రమాణములనియు, నెంచబడు వేదములందు పరతః ప్రమాణములైన యితరగ్రంథములందు ఆర్యపదమున్నదికాని హిందుపదములేదు.

"విజానీహ్యార్యాన్ యే చ దస్యవః" (ఋక్)
"ఆర్యః సర్వసమశ్చైవ"..........(రామాయణ)
"కర్తవ్య మాచరన్ కర్మ, అకర్తవ్యమనాచరన్
తిష్ఠతి ప్రకృతాచారే స వై ఆర్య ఇతి స్మృతః"

రామాయణము, గీత మున్నగు గ్రంథములలో నెక్కడను హిందుపదము కనిపింపదు.

పైన వర్ణించిన కారణములనుబట్టి నేడు హిందువులని పిలువబడు వారెల్లరు హిందుపదమును విడనాడి, తమ్ముతాము ఆర్యులని చెప్పుకొనుట యుచితము, గౌరవప్రదముగా కానవచ్చుచున్నది. ఆర్యపదము రుచింపకుండుటకు కారణము మృగ్యము. ఆర్యసమాజము నెడగల విరోధభావముతో, గంభీరము, శ్రేష్ఠమునగు నర్థమునిచ్చు ప్రాచీన ఆర్య

పదమును విడిచి, అన్యులు బలవంతముగానంటగట్టిన శ్రేష్ఠార్థమునీయని హిందుపదమును కౌగలించుకొని విడనాడకుండుట మంచిదికాదు. ఆర్యులైనంతమాత్రమున ఆర్యసామాజికులు కానక్కఱలేదు. ఆర్యసామాజిక సిద్ధాంతములతో తమకేకీభావము కుదరకపోయినచో ఆ సిద్ధాంతముల నంగీకరింపకపోవచ్చును. కాని ఆర్యనామమును విడనాడుటేల?

మతదృష్టితో - ధర్మదృష్టితో నేడు హిందువులనబడు వారెల్లరు తమ్ముతాము వైదికులని చెప్పుకొనుట ఉత్తమము - వేదచోదిత ధర్మములననుసరించువారెల్లరు వైదికులనబడుదురు.

'వేదోఽఖిలో ధర్మమూలమ్' అని మనువు చెప్పియున్నాడు.

'చోదనాలక్షణో ర్థోధర్మః' అని జైమిని మహర్షి వచించియున్నాడు. ఇట్లు వేదబోధిత ధర్మముల ననుసరించువారు వైదికులనబడుట సముచితమగును. వారెట్లు హిందువులగుదురు? అనర్థదాయకమగు హిందుపదవాచ్యు లెట్లగుదురు?

ఇక చరిత్రలో కొన్నినాళ్లుగా ఇతరదేశీయులచే నితర మతానుయాయులచే హిందువులని వ్యవహరింపబడిన మాత్రమున హిందుపదమును విడనాడరాదని యెక్కడ నున్నది? ఇంతకు పూర్వము ఇతరులచే హిందూదేశమనియు, హిందూస్థానమనియు వ్యవహరింపబడినను నేడు మనదేశమునకు భారతనామమును లోకసభ యంగీకరింపలేదా? ఇప్పుడు మనము దేశదృష్టితో భారతీయులము. అట్లే ధర్మదృష్టితో లేక మతదృష్టితో వైదికులమగుదుము; కాని, హిందువులమెన్నడునుకాము - కారాదు. కావున ఇప్పటికిని మించిపోయినదేమియులేదు. విశ్వహిందూపరిషత్తు వారు మామాటనాలోచించి తమ పరిషత్తునకు 'విశ్వవైదిక పరిషత్తు' అని నామకరణము చేసికొనిన బాగుండునని మా యభ్యర్థన. అప్పుడు విశ్వము నార్యమొనర్పగలరు. ఈశ్వరీయమైన వైదికధర్మము వర్ధిల్లగలదు. ఆర్యపదము జాతివాచకముకాదు. అదిగుణవాచకము. ఆర్య, ద్రవిడ, మంగోళియా ఆది జాతిభేదకవాచకములు చారిత్రకులు కల్పించినవి. వైదికుల దృష్టిలో మనుష్యులెల్లరు నొక్కజాతికి చెందినవారే. అది మానవజాతి.

తాత్కాలికముగా విశ్వ హిందూపరిషత్తువారు, హిందూపదముతో, బౌద్ధులను, జైనులను, సిక్కులను కూడగట్టుకొన యత్నించుటలో ప్రయోజనము కానము. వారు తమ్ముతాము హిందుపదముతో వ్యవహరింప నంగీకరింతురా? వారు నిజనామముతో సాధించుకొను రాజనైతిక లాభములను విడనాడుదురా? హిందూమతమననేమి? ఇవియన్నియు విచారణీయ విషయములుకావా?

* * * * *

## కణాదుడు - భౌతికవాదము

ఆస్తికనాస్తిక భేదములతో భారతీయ దర్శనములు రెండు విధములుగ వ్యవహరింపబడును. న్యాయము, వైశేషికము, సాంఖ్యము, యోగము, పూర్వమీమాంస, ఉత్తరమీమాంస అని ఆస్తికదర్శనములు ఆఱు. వీనినే షట్ శాస్త్రములందురు. వేదముల కివి యుపాంగములు. వీనిలో నొకటియగు వైశేషిక దర్శనమును రచియించినవాడే కణాదుడు. ఇతడొక ప్రాచీన మహర్షి. ప్రాచ్యతత్త్వజ్ఞులలో నతడన్యతముడు. భారతీయ దార్శనికులలో నతడు విశిష్టుడు.

ఈ మహర్షి యీ దేశమున నెట జనియించెనో, ఇతడు జీవించిన కాలమెయ్యదియో ఇదమత్థమని నిర్ణయించి చెప్పననువుకాదు. కణాదుడు కశ్యపగోత్రమునకు జెందినవాడగుట వలన కాశ్యపుడనియు, ఉలూక ముని పుత్రుడగుటవలన ఔలూకుడనియు పిలువబడెడివాడు. పంటచేలలో రాలిన గింజలనేరితెచ్చి వానిని భుజించుటచే నితనికి కణాదుడను నామము ప్రసిద్ధికి వచ్చినట్లు ప్రతీతి. దీనింబట్టి బాల్యమున తల్లిదండ్రులు ఇతనికి చేసిన నామకరణమేమో యెవరికి తెలియదు. ఇతడు ప్రభాసనివాసి యనియు, సోమశర్మడను నాచార్యుని యంతేవాసియై విద్యనభ్యసించినాడనియు కింవదంతి. మిలింద్ర ప్రశ్నము, లంకావతార సూత్రము, లలితవిస్తరము మున్నగు బౌద్ధ గ్రంథములలో నటనట కణాదదర్శనము ఉల్లేఖింపబడుటచే చారిత్రకులీమహర్షి బుద్ధునికంటె పూర్వుడు కావచ్చు

నని యూహింతురు.

కణాదిమహర్షి రచిత వైశేషిక దర్శనమునకు శాస్త్రములలో విశేష ప్రాముఖ్యమున్నది.

'కాణాదం పాణినీయం చ సర్వశాస్త్రోపకారకమ్' అను నీయభియుక్తోక్తియే యిందులకు ప్రమాణము. శబ్దముల సాధు స్వరూపమును నిర్ణయించుటకు పాణిని రచితవ్యాకరణమెంత యుపయోగకరమో, పదార్థముల స్వరూపస్వభావములను నిర్ణయించుటకు కణాద రచిత వైశేషికమంతటి యుపయుక్త శాస్త్రమని పైయుక్తి యభిప్రాయము.

అధునికులయిన చదువరులలో కొందఱు కణాదుని కేవల భౌతికవాది - ప్యూర్ మెటీరియలిస్టు - అనియెంచుటకలదు. కాని, కణాదరచిత వైశేషికదర్శనమును సాంగోపాంగముగ జదివినమీదట నతడు కేవల భౌతికవాదియని చెప్పుట కాధారములు కనిపింపవు. కారణమేమన నతడు తన శాస్త్రమునకు ప్రతిపాద్యములైన ద్రవ్యములను వివరించుచు నొకసూత్రమునిట్లు రచించెను.

"పృథివ్యాపస్తేజో వాయురాకాశం కాలో దిగాత్మా మన ఇతి ద్రవ్యాణి" భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, కాలము, దిక్కు, ఆత్మ, మనస్సు అనునవి తొమ్మిది ద్రవ్యములు. ఇందు భూమ్యాదులతోపాటు ఆత్మకూడ ఒక ద్రవ్యమని నుడివియున్నాడు. కేవల భౌతికవాదులు ఆత్మయను నొకపదార్థమున్నట్లు అంగీకరింపరుకదా! ఇంతేకాక కణాదుడు తనశాస్త్రమున వేదమునకు ప్రామాణ్యము నంగీకరించియున్నాడు. మఱియు నిఃశ్రేయసమతనికి పరమపురుషార్థము కూడ, కావున కణాదుడు కేవల భౌతికవాది కాకపోగా అధ్యాత్మవాదియనియే చెప్పనొప్పను. కేవల భౌతికవాదులు ఆత్మాస్తిత్వమును, వేదప్రామాణ్యమును నిఃశ్రేయసాదులను, నంగీకరింపరనుట విజ్ఞులకు విదితమే. అయినను కణాదుడు తనశాస్త్రమున ప్రధానముగ పదార్థములను గూర్చి వివరించి యుండుటవలనను ఆత్మనుగూడ నొకదార్థముగ నెంచుటవలనను నతడు కేవల భౌతికవాదియని కొందఱు భ్రమపడియుండవచ్చును.

ఇతర వైజ్ఞానికులవలెనే కణాదమహర్షి దృశ్యమాన ప్రపంచమంతయు పదార్థమయమనియెంచి ప్రపంచసమస్యను పరిష్కరింప యత్నించెను. అత

నిదృష్టిలో నీ ప్రపంచమున నున్న పదార్థములన్నియు ఆఱు.

"ద్రవ్య గుణ కర్మ సామాన్య విశేష సమవాయాః పదార్థాః"

ద్రవ్యములు, గుణములు, కర్మలు, సామాన్యము, విశేషము, సమవాయము. ఈ యాఱింటియందును ద్రవ్యగుణ కర్మలు మూడు ముఖ్యములు. మిగిలినవి గౌణములు.

పదార్థములలో ప్రథమముగ లెక్కించిన ద్రవ్యములు తొమ్మిది. భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, కాలము, దిక్కు, ఆత్మ, మనస్సు. వీనిలో ఆత్మతక్క మిగిలిన భూమ్యాది పదార్థములన్నియు జడములు. అనగా జ్ఞానము, ఇచ్ఛ, ప్రయత్నము అను గుణములు లేనిపదార్థములు. ఈ గుణములు చేతనపదార్థములయిన ఆత్మపరమాత్మలలో నుండును. భూమ్యాది ద్రవ్యములలో రూపరసాదిగుణములుండును. క్రియలకు గుణములకు ఆశ్రయము ద్రవ్యమని ద్రవ్యసామాన్య లక్షణము. ద్రవ్యమని చెప్పబడు ప్రతిపదార్థమందును క్రియకాని, గుణముకాని, లేక రెండునుగాని యుండునని యభిప్రాయము. విశిష్ట గుణముల కాశ్రయములై ద్రవ్యములు పరస్పరము భిన్నములగుచున్నవి.

కణాదుని దృష్టిలో భూమ్యాది ద్రవ్యములెట్లు గుణముల కాశ్రయములో యట్లే ఆత్మయు జ్ఞానాది గుణముల కాశ్రయమైన ద్రవ్యముగా నెంచబడును. అతనిదృష్టిలో ఆత్మ పాశ్చాత్య దార్శనికులలో కొందఱుతలంచునట్లు కాల్పనిక భావపదార్థము కాదు. అది యునికిగల పదార్థము. అదిసత్యము. అది నిత్యమును.

కణాదుడు ఆత్మసాధకములుగా తనశాస్త్రమున నీక్రింది గుణముల నిట్లు వర్ణించియున్నాడు.

"ప్రాణాపాననిమేషోన్మేష జీవనమనోగతీంద్రియాంతర
వికారాః సుఖదుఃఖేచ్ఛాద్వేష ప్రయత్నాశ్చాత్మనో లింగాని"

3-2-4

ప్రాణము, అపానము, నిమేషోన్మేషములు, జీవనము, మనోగతి ఇంద్రియాంతర వికారములు సుఖదుఃఖములు ఇచ్ఛాద్వేషములు, జ్ఞాన ప్రయత్నములు అను నీగుణములు ఆత్మాస్తిత్వమును నిర్ణయింప సాధనములని మహర్షి అభిప్రాయము.

కణాదుడు వర్ణించిన ద్రవ్యములలో కాలము దిక్కు అనునివిరెండును వ్యావహారికములు. ఇప్పుడు, అప్పుడు, ఇక్కడ, అక్కడ అనుపదములచే నియ్యవి నిర్దేశింపబడును.

కణాదుడు వివరించిన పదార్థములలో ఆత్మయొక్కటి తక్క మిగిలిన భూమ్యాది ద్రవ్యములన్నియు అణుసంయోగ జనితములు, అణువులు సూక్ష్మపదార్థములు. వాని సంయోగమువలననే ప్రపంచమున దృశ్యము లగు స్థూలపదార్థములన్నియు నేర్పడినవి. వ్యవహారమునసున్న భూమ్యా దిద్రవ్యములకు మూలములు అణువులని నిరూపించినవాడు కణాదుడు. భారతీయ తత్త్వవేత్తలలో కణాదుడే ప్రప్రథమమున అణుసిద్ధాంతమును కనిపెట్టినవాడు. నిజము చెప్పిన ప్రపంచతత్త్వవేత్తలలోనే అతడు ప్రప్రథ ముడనుట అతిశయోక్తికాదేమో. అతనికంటె ముందుగా నీ ప్రపంచమం తయు సూక్ష్మములయిన అణువులచే నిర్మింపబడినదని నుడివినతత్త్వవేత్త మఱియొకడెవడున్నాడు?

మనచే నెఱుగబడు నీ ప్రపంచములోని పదార్థములన్నియు కార్య ములు. అనగా కారణజనితములు. స్థూలముగా కనిపించు నీ వస్తువులను మనము ఖండఖండములుగా విభజింపవచ్చును. అట్లు విభజించుచు పోయినచో తుదకు అనేక సూక్ష్మవస్తువులుగా నివి మిగులును. ఇక నవి విభజింపననువు కానివిగా - అవిభాజ్యములుగా, అవయవరహితములుగా నుండును. వానినే కణాదమహర్షి, అణువులనియో లేక పరమాణువుల నియో వ్యవహరించును. స్థూలరూపమున నున్నపుడు మనకు భిన్నబిన్న ములుగా కనిపించు పదార్థములకు కారణభూతములగు నా సూక్ష్మాణు వులుకూడ పరస్పరభిన్నములనియే కణాదుడెంచుచున్నాడు. అనగా పర మాణువుల రూపమున నున్నవాని స్వరూపస్వభావములు సమానములు కావనియే కణాదుని యభిప్రాయము. అణువులన్నియు సమాన-జాతీయ ములగునెడల వానిమూలమున నేర్పడు నీస్థూలపదార్థము లన్నియు పర స్పర భిన్నములుగా నుండక సమానముగా నొక్కటిగా నుండవలసివచ్చును.

కణాదుని భౌతికవాదము కార్యకారణ భావాత్మకము. కారణ భేదము వలననే కార్యభేదమేర్పడును. కార్యవైచిత్ర్యమునకు కారణవైచిత్ర్యము మూలము. ప్రపంచరూప కార్యజాతమున కంతటికి మూలకారణములైన

పరమాణువులు పరస్పరము భిన్నములైనచో వానిభిన్నతకు కారణమేమై యుండును? అను ప్రశ్నకు సమాధానము కణాదుడు విశేషపదార్థమని నుడువును. పరమాణువులలో భేదమును సాధించుటకే విశేషనామక పదార్థమొండు కలదని తనశాస్త్రమున వర్ణించియున్నాడు. ఆ విశేష పదార్థము వలననే కణాదదర్శనము వైశేషికదర్శనమని పిలువబడుచున్నది.

కణాదుని భౌతికవాదమున ననేక విషయములు విశేషముగ పేర్కొనదగినవి యున్నవి. వానిలో ధర్మమొక్కటి. అతడు తన శాస్త్రమును "అథాతోధర్మం వ్యాఖ్యాస్యామః" అని ధర్మపదముతో ప్రారంభించియున్నాడు. ఈ ధర్మము మీమాంసకుల ధర్మమువంటిదికాదు. ఇయ్యది అభ్యుదయనిఃశ్రేయససాధకము. అందువలననే యతడు "యతోఽభ్యుదయనిః శ్రేయససిద్ధిః స ధర్మః" అని సూత్రించియున్నాడు. కణాదుని యీ ధర్మము లౌకిక పదార్థములకు సంబంధించిన యలౌకిక వస్తువు కాదు. ప్రపంచ గత పదార్థజాతమునందు సామాన్య విశేష గుణముల రూపమున గోచరించునదియే యిట ధర్మదముచే సూచింపబడుచున్నది. అప్పుడే యది యభ్యుదయ నిఃశ్రేయసములకు సాధకము కాగలదు. అభ్యుదయ మిటమానవు డిహ పరములలో బొందు సర్వతోముఖాభివృద్ధియే. అది యెట్లు సిద్ధించునన : మనుష్యుడు తనచుట్టు వ్యాపించియున్న పదార్థముల గుణగణములను - అనగా వానిధర్మమును గుర్తించును. అగ్నిలో ఉష్ణత, వాయువున స్పర్శ, భూమియందు గంధము నను విశేషధర్మములనెల్లరు గుర్తించుచున్నారు. ఇట్లే సర్వపదార్థములందును ధర్మవిశేషములుండును. వస్తుధర్మములు బాగుగ తెలిసినపుడావస్తువులు తనయభివృద్ధికి సాధన ములగుచో మానవుడు వానిని గ్రహించును. అట్లుకానినాడు వానిని విసర్జించును. వస్తుధర్మజ్ఞానమే తత్త్వజ్ఞానము. అదియే వస్తువుల యుపాదేయ, అనుపాదేయతలకు కారణము. ఇట్టితత్త్వజ్ఞానమే జన్మమరణ జరావ్యాధిరూప దుఃఖముల నుండి మానవుని విడివడజేయును. తత్త్వజ్ఞానము లేనినాడు మానవుడు పదార్థములను సరిగా ఉపయోగించుకొనలేక దుఃఖములందు చిక్కువడును. పదార్థములలో నున్న సమానధర్మములు, విశేషధర్మములు పూర్తిగ తెలిసికొనుటయే తత్త్వజ్ఞానము. దానివలననే నిఃశ్రేయసము సిద్ధించును.

దీనినే కణాదుడొకసూత్రమున నిట్లు నుడివియున్నాడు.

"....ద్రవ్యగుణకర్మ సామాన్య విశేష సమవాయానాం పదార్థానాం సాధర్మ్యవైధర్మ్యాభ్యాం తత్త్వజ్ఞానా న్నిః శ్రేయసాధిగమః"

ద్రవ్యాది పదార్థములలోగల సాధర్మ్య వైధర్మ్యముల ద్వారమున తత్త్వజ్ఞానము కలుగును. దానివలన నిఃశ్రేయసము సిద్ధించును. పదార్థము లన్నింటిలోను ఆత్మపదార్థమతి సూక్ష్మము. దానిని సాక్షాత్కారము చేసికొనినపిదప నికతెలియదగినవస్తువేమియు మిగులదు. సర్వము తెలిసిన వాడగును. బంధనమునకు హేతువైన అజ్ఞానము తొలగును. జన్మమరణ రూపబంధనము నుండి విడివడును. ఆత్మానందము ననుభవించును. ఇదియే శాస్త్రములందు చెప్పబడిన నిఃశ్రేయసము.

# ఓ దయానంద ! ఋషివర్య ! యోగివర్య !

సీ. ఘూర్జరదేశాన గొప్ప కీర్తినిగన్న
యౌదీచ్య వంశాన నలరి తీవు
బ్రహ్మచర్యము బూని బ్రహ్మనిష్ఠుడవన్న
కీర్తిని నిలలోన గెలిచి తీవు
వేదశాస్త్రమ్ములు విరివిగా బఠియించి
ధర్మమార్గమ్మున దనరి తీవు
విద్యా విహీనులై వెలలేని వారికి
చదువుల విలువను జాటితీవు
భారతీయుల బాముల బాపగోరి
యెన్ని యిడుమల బడితివో యెన్నలేను
నిన్ను నేమని కొనియాడ నేర్తు నయ్య !
ఓ దయానంద ఋషివర్య యోగివర్య !! 1

జడపూజలను సల్పి జడులైన వారికి
జేతన గరిమను జెప్పి తీవు
కర్మవిహీనులై క్రాలెడు వారికి
కర్మ విశిష్టత గఱపి తీవు
బానిసవృత్తితో బరగెడు వారికి
స్వాతంత్ర్య మహిమను జాటితీవు
పరదేశ వస్తువుల్ భావించు వారికి
నిజవస్తు శ్రేష్ఠత నేర్పితీవు
భారతీయుల యజ్ఞత బాపగోరి
యెన్ని యిడుమల బడితివో యెన్నలేను
నిన్ను నేమని వర్ణింప నేర్తునయ్య !
ఓ దయానంద ఋషివర్య యోగివర్య !! 2

వేదవిద్యలు వీడి వేదమార్గము వీడి
పతితు లౌవారి గాపాడి తీవు
ఆశ్రమ ధర్మము లడుగంటగా జూచి
పున రుద్ధరింపగా బూని తీవు
చానల కేటికి చదువన్న చేదస్త
బాపల మూర్ఖత బాపి తీవు

అంటరాని తనమ్ము నవమానమని యెంచి
దానిని దునుమాడ దలచి తీవు
భారతీయుల యజ్ఞత బాపగోరి
యెన్ని యిడుముల బడితివో యెన్నలేను
నిన్ను నేమని కొనియాడ నేర్తునయ్యా !
ఓ దయానంద ఋషివర్య యోగివర్య !! 3

విగ్రహారాధన విహితమ్ము కాదని
వేనోళ్ళ బోధించి వెలసితీవు
పాషాణ పూజలు పాటింపరాదని
పలుమారు సభలలో బల్కితీవు
దేవుని కాలయాల్ తెగి కట్టరాదని
దేశ దేశాలలో దెల్పితీవు
ఆకార మాత్మకు నరయంగ లేదని
యనువుగా వచియించి యలరితీవు
నిన్ను నెదురింప బండితుల్ నేరరైరి
భక్తులెందఱో విగ్రహాల్ బాఱవైచి
మదిని భగవంతు గొల్వగా మరలినారు
ఓ దయానంద ఋషివర్య యోగివర్య !! 4

వారాణసీగత వాగ్విశారదులకు
సింహ స్వప్నంబవై చెలగితీవు
శబ్దానుశాసన చండప్రచండుడౌ డా
బాలశాస్త్రిని భంగపఱచితీవు
కాశీ నరేశుని కనుగప్పి మనుచున్న
అల్పబుద్ధుల దర్ప మడచితీవు
జ్యోతిర్విదులమంచు జొప్పడ జెప్పెడు
జనవంచకుల తీరు చాటి తీవు
సిద్ధుడవు నీవు జనులకు సిద్ధిగఱప
నవతరించితి వవనిలో నార్యవర్య !
నిన్ను నేవిధి గొనియాడ నేర్తునయ్య !
ఓ దయానంద ఋషివర్య యోగివర్య !! 5

**8-11-68** - గోపదేవ్

# డా॥ పండిత గోపదేవ్

జననము : క్రీ.శ. 1900 ప్రాంతము

జననీజనకులు: శ్రీ అంబమాంబా రామయార్యులు

స్థానము : కూచిపూడి, తెనాలి తాలూకా

వృత్తి : వైదిక ధర్మ వ్యాపకత

రచనలు,

అనువాదములు: న్యాయ – వైశేషిక – సాంఖ్య – యోగ – వేదాంత దర్శనములు, ఈశ – కేన – కఠ – ప్రశ్న - ముండక – మాండూక్య ఐతరేయ – తైత్తిరీయ - శ్వేతాశ్వతర – ఛాందోగ్య – బృహదారణ్యకోపనిషత్తులు, ఆస్తికవాదము, అర్థ - ధర్మ మీమాంస, పంచమహాయజ్ఞవిధి, శ్రీమద్ భగవద్గీత, ఋగ్వేదాది భాష్యభూమిక, ఏసుక్రీస్తు రహస్య జీవనము, సంస్కారవిధి, ఋగ్వేద భాష్యభాస్కరము 1,2,3, – వైదిక పర్వ పద్ధతి అపశూద్రాధికరణము మొదలగు చిన్న పుస్తకములు 25, సత్యార్థ ప్రకాశము, నిరుక్తము etc.